గాయత్రీ గ్రంథమాల - 10

ప్రథమ మరియు ద్వితీయ ముద్రణ - 5000

తృతీయ ముద్రణము - 3000

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 097

దయానందాబ్దము : 172

ధాత, యుగాది, 1996.

**మూల్యము : రు. 6.00**

(పోస్టు ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమము,
12-10-586/6, వ్యాస్‌నగర్ (మేడిబావి),
సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

2. వైదిక సాహిత్య భండార్,
ఆర్య సమాజము, సుల్తాన్ బజార్,
హైదరాబాద్ - 500 001.

3. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య,
స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738,
కంచరి బజార్, సికింద్రాబాద్ - 500 003.

4. శ్రీ ఆర్. కృష్ణమూర్తి, బుక్‌సెల్లర్స్,
ఆర్యసమాజ మందిరము, మెయిన్‌రోడ్డు,
సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

ముద్రణ : **PRINTSHOP**, Secunderabad

ఫోను : 812904/818296

# ఈ పుస్తకమును గురించి

'వేదాంతి భేరి' మాస పత్రిక ప్రశంస

గాయత్రీ మంత్రార్థమును, గాయత్రీ మహిమను తెలుపు మహత్తర గ్రంథరాజ మిది. గాయత్రీ మంత్రమును జపించుట వలన కలుగు అద్భుత ఫలితములు యిందు వివరింప బడినవి. మంత్రజపము వలన జీవునకు చిత్త శుద్ధి కలుగును. చిత్తశుద్ధి వలన ఆత్మజ్ఞానము ఉదయించును. కాబట్టి సాధకుడు మంత్ర జపము చేయుట చాలా మంచిది. సులభమైన భాషలో గాయత్రీ మంత్రార్థము తెలుప బడిన ఈ పుస్తకము భక్తులకు ఒక వరప్రాసద మనియే చెప్పవచ్చును.

('వేధాంతి భేరి' - అక్టోబరు, 1989)

'వేధాంతి భేరి' నవంబరు పత్రిక నుండి ఈ పుస్తకము వరసగా (సీరియల్ గా) ప్రచురింప బడుచున్నది.



స్తుతా మయా వరదా వేదమాతా
ప్రచోదయంతాం పావమానీ ద్విజానామ్.
ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం
ద్రవిణం బ్రహ్మవర్చసమ్.
మహ్యం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్.
(అథ. 19-71-1)

" ప్రచోదయాత్ " పద మంతమందు గలిగి ద్విజులను (విద్యాగర్భమునుండి రెండవసారి జన్మను పొందిన విద్యావంతులను) పవిత్ర పరచు వేదమాత - గాయత్రి నాకు ఈ లోకమున దీర్ఘాయువును, బలమైన ప్రాణశక్తిని, సుసంతానమును, గో అశ్వాది పశు సంపదలను, కీర్తిని, ధనమును, బ్రహ్మ (వేద) జ్ఞాన ప్రకాశమును నొసగి తదుపరి బ్రహ్మ లోకమునకు ( ముక్తిధామమునకు) చేర్చును గాక !

అట్టి వరముల నిచ్చు వేదమాత గాయత్రి నాచే స్తుతింపబడుచున్నది.

ఓ౩మ్

# గాయత్రీ మహిమ

"యా గాయంతం త్రాయతే సా గాయత్రీ" (యజు) గానము (జపము) చేయువారిని రక్షించును గాన ఈ మంత్రమునకు గాయత్రీ అని పేరు.

ప్రపంచ ఇతిహాసములలో మన భారతీయ ఇతిహాసము ప్రాచీన తమము. సుమారు 197 కోట్ల సంవత్సరముల చరిత్ర మనకు గలదు. అందు యిప్పుడు సప్తమ మన్వంతరమున యిరువది ఎనిమిదవ కలియుగము నడుచుచున్నది. ప్రథమ మానవసృష్టి సమయముననే ఈశ్వర వాణియైన వేదములు ఋషుల ద్వారా ఈ భారతావనిపై ఆవిర్భవించినవి. అప్పటినుండి ఈ కలియుగ ప్రారంభము వరకు ప్రపంచమంతటవేద సంస్కృతియే యుండెడిది. భారతీయ సార్వభౌమ రాజ్యమే ప్రపంచము నేలుచుండెడిది. ఆ కాలమున గాయత్రీ ఉపాసన సర్వత్రా జరుగుచుండెడిది. బాలబాలికలకు 8,9 సం. ప్రాయముననే ఉపనయనము చేసి గురుకులమునకు పంపెడివారు. గురుకులమున వేదారంభ సంస్కారము జరిపించి గాయత్రీ ఉపదేశము చేసెడివారు. అప్పటినుండి వారు జీవిత పర్యంతము నిత్యము ఉదయ సాయం సంధ్యా సమయాలలో శక్తికొలది గాయత్రీ జపము చేయుచుండెడివారు. తద్వారా వారి బుద్ధి వికాసము చెంది విద్యా విజ్ఞానములు వర్ధిల్లెడివి. సత్కర్మలయందు ప్రేరణ గలిగి అభ్యుదయ నిః శ్రేయసముల బొందెడివారు. అందుచేతనే ప్రథమ స్మృతికర్తయైన మనువు తన ధర్మశాస్త్రములో ఈ దేశ విద్వాంసులే ప్రపంచ గురువులనియు, ఈ దేశ రాజన్యులే ప్రపంచ చక్రవర్తులనియు, ఈ దేశ సదాచారమే ప్రపంచమునకు ఆదర్శమనియు ఎలుగెత్తి చాటెను.

మహాభారత యుద్ధానంతరము ఈ కలియుగ ప్రారంభము నుండి ఈ వైభవము తగ్గుచు భౌగోళిక, భావ దాస్యములకు గురియైనది. స్వార్థ సామంత రాజులు ఈ దేశమును ముక్కలు ముక్కలుగా జేసిరి. తద్వారా విదేశీయులకు బానిసల మైతిమి. స్వార్థ గురువులు అఖండ వేద సంస్కృతిని ముక్కలు ముక్కలుగా చేసి సాంప్రదాయ ముల నేర్పరచిరి. తద్వారా ఐకమత్యము కరువైనది. ఎట్లో భౌగోళిక స్వాతంత్ర్యము లభించెను. కాని భావదాస్యము పోలేదు. ఆంగ్లమానస పుత్రులు ఆంగ్లేయులనే గురువులుగా నుపాసించు చుండగా అమాయి కులైన సామాన్య ప్రజలు స్వార్థ గురువుల వలలలో చిక్కుకొని వారి సాంప్రదాయ బావులలో కూపస్థమండూకముల వలె జీవించు చున్నారు. దీనికితోడు "స్త్రీ, శూద్రా నాధీయాతాం" అను కల్పిత సూత్రముల ప్రచారము వలన వేద పఠన పాఠనములు, గాయత్రీ ప్రచారము కొన్ని వర్గముల పురుషులవరకు మాత్రమే పరిమితమై పోయినది సాంప్రదా యక గురువుల " ఓం నమో నారాయణాయ ", " హరే రామ హరే కృష్ణ " అను వాక్యములే నేడు మంత్రోపదేశములుగ మిగిలిపో యినవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులైన పురుషులు కూడ నేడు గాయత్రీ జపము చేయుట లేదు. కొద్ది మంది పూర్వాచార పరా యణులు సంధ్యావందనములో గాయత్రిని స్మరించినను వారి దృష్టిలో గాయత్రి ఒక దేవత. ఐదు వేరు వేరు రంగులు కలిగిన ముఖములతో, అనేక బాహువులతో పూజలందుకొనుచు భక్తుల కోరికలను తీర్చు ఒక దేవతామూర్తి. మరికొందరి దృష్టిలో గాయత్రి అనగా ఆకాశమున కనబడు సూర్యగోళము. అందుచేతనే వారు గాయత్రీ మంత్రముతో సూర్యునకు అర్ఘ్యమిచ్చుచున్నారు.

ఈ మధ్య గాయత్రీ మంత్ర ఆంగ్ల వ్యాఖ్యానముతో కూడిన ఒక లఘు పుస్తకము 70 సం. వయస్సుగల ఒక భక్తున కివ్వగ వారు గాయత్రి ఒక మంత్రమా ? దేవత కాదా ? అని అడిగియుండిరి. వారు చిన్ననాటినుండియు గురుసేవా శుశ్రూషలు చేయుచు బ్రహ్మ

చారిగ అనేక ఆశ్రమములలో జీవితము గడిపినవారు. అట్టి వారికే గాయత్రి అనగ ఏమిటో తెలియకపోయిన సామాన్యుల సంగతి వేరుగా చెప్పవలెనా ? వీటికి తోడు గాయత్రీ మంత్రము ననుకరించుచు హనుమాన్ గాయత్రీ, దేవీ గాయత్రీ, శివ గాయత్రీ మొదలగు అనేక గాయత్రీ మంత్రము లుద్భవించినవి - ఉద్భవించుచున్నవి. గాయత్రీ మంత్రములోని ప్రతి అక్షరముతోను ప్రారంభింపబడిన 24 అక్షరాల గాయత్రీ మంత్రములును గలవు. గాయత్రి విశ్వామిత్రుని శాపమునకు గురియైనదనియును, ఆ శాప నివారణార్థము మరియొక మంత్రమును ముందు జపించి తరువాత గాయత్రి జపము చేయవలెననియు కొందరి ప్రచారము. మరికొందరు గాయత్రి శిరస్సహితముగా జపించవలెననియు "ఓం ఆపోజ్యోతీ రసోమృతం...." అను మంత్రమే ఆ శిరస్సనియు, దానిని గాయత్రీ చివర చదువవలెననియు చెప్పుదురు. యిట్టి మాటలు ప్రాచీన శాస్త్రము లందెచ్చటను చెప్పబడలేదు. ఇవన్నియు మధ్యకాలమున స్వార్థ గురువులు ప్రచారము చేసినవియే. శ్రీరాముని గురువైన విశ్వామిత్రుడే గాయత్రీ మంత్ర ఋషి యని నిరూపించలేము. అంతకు పూర్వ గ్రంథములైన బ్రాహ్మణాదులలో కూడ ఈ నిర్దేశము గలదు. అందుచే వేదకాలమునాటి విశ్వామిత్రుడను పేరుగల ఋషి ఈ మంత్ర ద్రష్టయై మంత్రార్థమును లోకములో ప్రచారము చేసి యుండును. ఆ గాయత్రీ మంత్రము ఈ త్రేతాయుగమున రాముని గురువుయైన విశ్వామిత్రుడు జపించి సిద్ధిని - బుద్ధి వికాసమును పొంది విజ్ఞానవంతుడై అద్భుతములను చేసి యుండును. ఇక శిరస్సు అనునది మంత్రము చివర కాక మొదట నుండవలయును. మరొక మంత్రము శిరస్సని చెప్పుట కన్న మొదటి మహావ్యాహృతులనే శిరస్సని చెప్పిన సమంజసముగా నుండును. అందుచేత గాయత్రిని గూర్చి సరియైన అవగాహన కలుగుటకై ఈ చిన్న పొత్తమును ప్రచురింప సంకల్పించితిమి. ఏ కొద్దిమంది గాయత్రినిగూర్చి సరిగా నర్థము చేసుకున్నను మా కృషి సఫలము కాగలదు.

# గాయత్రీ అనగా....

గాయత్రి అనగా వేదములలోని సప్త ఛందస్సులలో నొకటి. మూడు పాదములు గలిగి ప్రతి పాదము నందును 8 అక్షరములతో మొత్తము 24 అక్షరములు గల పద్య ఛందస్సును గాయత్రీ ఛందస్సు యందురు. సౌలభ్యము కొరకు నొకటి, రెండు అక్షరములు ఎక్కువ యున్ననూ, తక్కువ యున్నను, గాయత్రీ ఛందస్సుగానే లోకములో వ్యవహారము గలదు. మన ఈ గాయత్రీ మంత్రములో 23 అక్షరములు మాత్రమే గలవు. అందుచే యిది నిచృత్ గాయత్రీ యగును. ఇట్టి గాయత్రీ ఛందస్సు గల వేదమంత్రములు నాలుగు వేదములలోను అనేకము గలవు. కాని ఈ మంత్రమునకే గాయత్రీ మంత్రమను రూఢి(యోగా రూఢి) నామము అనాదిగా వచ్చుచున్నది. అక్షరములను లెక్కించునపుడు పొల్లు అక్షరములను(కేవల హల్లులను) వదిలి అచ్చులతో కూడిన అక్షరములనే లెక్కింతురు. మంత్రమునకు ముందు ఉచ్చరించు "ఓం" మరియు "భూర్భువః స్వః" అను మూడు మహా వ్యాహృతులు గణనకు రావు. గాయత్రీ మంత్రములో ముందు 'తత్' అను పదము వచ్చుట చేతను దానికి వాచ్యమైన పరమేశ్వర లక్షణము ఆ మహావ్యాహృతులందు చెప్పబడుట చేతను మహావ్యాహృతులతో కలిపియే గాయత్రీ జపము చేయుచుండుట కూడ అనాదిగా వచ్చుచున్న ఆచారము. శతపథ బ్రాహ్మణము (14-8-25-7) నందు గాయత్రీ పదము ఈ విధముగ నిర్వచింపబడెను. "గాయంతం త్రాయతే" - "గయాన్ ప్రాణాన్ త్రాయతే" - గానము (జపము) చేయువారి ప్రాణ శక్తిని రక్షించును గాన గాయత్రీ యని పేరు. బృహదారణ్యకోపనిషత్తు (5-4-14)నందును యిట్లే నిర్వచింపబడెను.

"ప్రాణా వై గయాస్తత్ ప్రాణాం స్తత్రే

తద్యత్ గయాం స్త్రత్రే తస్మాత్ గాయత్రీ నామ"

గాయత్రీ పదములో గాయ, త్రి అను రెండు శబ్దము లున్నవి. గాయ శబ్దము గయ వలన నేర్పడినది. గయ యనగా ప్రాణములు. ప్రాణములను రక్షించునది గాన గాయత్రీ యనబడును.

ఈ మంత్రమునకు సావిత్రీ మంత్రమని మరియొక పేరు గలదు. ఈ మంత్రదేవత సవిత యగుటచే సావిత్రీ మంత్రమను పేరు వచ్చెను. మంత్ర దేవత యనగా మంత్రములో చెప్పబడిన విషయము. ఈ వివరణ మంత్రము నర్థము చేసికొనుటకు ఎంతగానో తోడ్పడును. సవితను గురించి ముందు పుటలలో వివరముగా తెలిసికొందము.

ఈ మంత్రమునకే గురుమంత్రమనే ప్రసిద్ధి గలదు. ప్రాచీన కాలములో విద్యాభ్యాసము చేయవచ్చిన శిష్యులకు గురువులు వేదారంభ సంస్కారముచేసి గాయత్రిని ఉపదేశించెడివారు. అందుచే ఈ మంత్రమునకు గురుమంత్రమను పేరు వచ్చెను. నేటి గురువులు మంత్రోపదేశము పేరుతో "ఓం నమః శివాయ", "ఓం నమో నారాయణాయ" అను వాక్యములనే ఉపదేశించు చున్నారు. గాయత్రిని ఉదేశించుటలేదు. 19వ శతాబ్దమున వేదములు మానవులందరు చదువవచ్చుననియు, వినవచ్చుననియు సప్రమాణముగ నిరూపించిన వారు మహర్షి దయానందులు. గాయత్రీ మంత్రము స్త్రీ, శూద్రులకు కూడ ఉపదేశించిన మహానుభావుడు దయానందుడు.

వేదములలోని పద్యములను మంత్రము లందురు. మంత్రమనగా ఒక ఆలోచన. మననము చేయుకొలదీ విశేషార్థము గోచరించును. గాన వీటిని కేవలము పారాయణ - జపము చేసినంత మాత్రమున సరిపోదు. ఒక మంత్రమును గూర్చి, మంత్రములోని పదములను గూర్చి ఏకాంతమున లోతుగా నాలోచించి తెలుసుకొనవలెను.

# గాయత్రీ మహా మంత్రము

(గురుమంత్రము, సావిత్రీ మంత్రము, పరమ (శ్రేష్ఠ) మంత్రము)

ఋషి: విశ్వామిత్రుడు - దేవత: సవిత

ఛందస్సు: గాయత్రీ - స్వరము: షడ్జః

**ఓ౩మ్ భూర్భువః స్వః**

**తత్సవితుర్వరేణ్యమ్**

**భర్గో దేవస్య ధీమహి**

**ధియో యో నః ప్రచోదయత్**

(ఋ. 3-62-10; యజు. 3-35, 22-9, 30-2, 36-3 సామ. 2462; అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములు)

భావార్థము:- హే రక్షక ! సచ్చిదానంద స్వరూప ! జగదుత్పాదక దేవ ! నీ దివ్య గుణయుక్తము వరేణ్యమునగు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక ! నీవు మా బుద్ధిని వికసింపజేసి సత్కర్మల యందు ప్రేరేపింతువు గాక ! మే మా బుద్ధి సహాయమున సద్వ్రతముల నాచరించి అభ్యుదయ నిఃశ్రేయసముల నందుదుము గాక !

## ప్రతి పదార్థము

ఓ౩మ్ = పరమేశ్వరుడు సర్వ సంరక్షకుడు

భూః = సత్ స్వరూపుడు (ఉనికి గలవాడు)

భువః = చిత్ స్వరూపుడు (జ్ఞాన స్వరూపుడు)

స్వః = ఆనంద స్వరూపుడు (దుఃఖ రహితుడు)

తత్ = అట్టి సచ్చిదానంద లక్షణయుక్త పరమేశ్వరుడు

సవితుః = ఈ సృష్టికి కర్త

వరేణ్యం = సుఖ స్వరూపుడగుటచే జీవులందరి చేత వరింప-కోరదగినవాడు

భర్గః = శుద్ధ స్వరూపుడు (పాప రహితుడు)

దేవస్య = అట్టి అనేక దివ్యగుణములు గల దేవుని యొక్క దివ్య స్వరూపమును

ధీమహి = (మేము మా హృదయమున) ధ్యానింతుము గాక!

యః = ఆ పరమేశ్వరుడు

నః ధియః = మా బుద్ధులను

ప్రచోదయాత్ = సత్కర్మలయందు ప్రేరేపించి అభ్యుదయ నిః శ్రేయసములను పొంద సమర్థము చేయును గాక!

# ఓం

వేదము లందు పరమేశ్వరునకు వందకు పైగా పేర్లు గలవు. ఇవి యన్నియు అతని గుణకర్మలను తెలుపును. అందు 'ఓం' నామము ముఖ్యమైనది. 'అవ - రక్షణే' అను ధాతువుతో ' ఓం ' పదము సిద్ధించును. ఓం అనగా రక్షించువాడు-సంరక్షకుడు (Guardian) యని అర్థము. ఈ నామము పరమేశ్వరునకు జీవునకు గల స్పష్టమైన సంబంధము తెలుపును. తల్లి మనకు శరీరమును నిర్మించి యిచ్చునే కాని ఆత్మ స్వరూపులమైన మనకు జన్మ నివ్వలేదు. అట్లే దేవుడు తల్లి గర్భకోశములో మనకు శరీరమును నిర్మించి యిచ్చునే కాని జీవాత్మలమైన మనను పుట్టించుటలేదు. జీవాత్మ కూడ చావు పుట్టు కలు లేని అనాదితత్త్వము. బాల్యములో తల్లి మనను సంరక్షించినట్లే జీవిత పర్యంతము - జన్మజన్మాంతరము లందును పరమేశ్వరుడు మనకు సంరక్షకుడై యుండును. తల్లి దండించునట్లే సంస్కరించుటకై అతడు మనలను దండించును. అంతర్యామియై మన ఉన్నతి కొరకు సత్కర్మల యందు ప్రేరణలను, దుష్కర్మల యందు భయాందోళనలను గలిగించు చుండును. కనుక అతడు గొప్ప రక్షకుడు.

మనము తల్లి ఒడిని చేరునపుడు ఆమెను పేరుతోగాని, ఆమె గుణకర్మలను తెలుపు నామములతో (డాక్టరు, టీచర్, మేడమ్ మొ. పేర్లతో) గాని పిలువక 'అమ్మా' అను కమ్మని పిలుపుతో ఆమె ఒడి చేరుదుము. అట్లే భగవంతుని చేరగోరువారు అతని గుణకర్మలను తెలుపు పేర్లు అనేకమున్నను ఓం నామముతో 'ఓ సర్వ సంరక్షకా! నా రక్షకా!' అని పిలుచుచు అతనిని సులువుగ చేరుకో గలుగుదుము. అందుచేతనే పతంజలి మహర్షి తన యోగ శాస్త్రములో "తస్య వాచకః ప్రణవః, తజ్జప స్తదర్థ భావనమ్" అని చెప్పియుండెను. అనగా ఆ పరమేశ్వర నామము ప్రణవము - ఓం అనియు, ఆ ఓం నామమును

జపించుచు అర్థభావన చేయవలెననియు చెప్పెను. మనో ఏకాగ్రతకు "ఏత దాలంబనమ్ శ్రేష్ఠం, ఏత దాలంబనమ్ పరం" ఓంకార జపమే శ్రేష్ఠమైన, ఉత్తమమైన సాధనమని కఠోపనిషత్తు చెప్పను.

భాషా శాస్త్రమును బట్టి చూచినను ఓం పదములో గొప్ప అర్థము గలదు. అ, ఉ, మ అను అక్షరముల కలయికతో ఓం పద మేర్పడును. ఈ మూడు అక్షరములు భగవంతుని మూడు ముఖ్యశక్తులైన సృష్టి, స్థితి లయములను తెలుపును.

'అ' అను అక్షరమును ఉచ్చరించునపుడు నోరు బాగుగా తెరచుకొనును. స్వరపేటిక నుండి ధ్వని వెడలును. ఇది భగవంతుని సృష్టి రచనా ప్రారంభమును తెలుపును. అన్ని భాషలలోను యిది మొదటి అక్షరము. ఈ శక్తినే వేదములు సవిత పదముతో చెప్పను. పురాణములు బ్రహ్మగా పేర్కొనును.

'ఉ' ను ఉచ్చరించునపుడు నోరు తెరచుకొని యుండియే పెదవులు గుండ్రముగా వంగును. స్వరపేటిక ద్వారా వచ్చు గాలి నోరంతా ప్రవహించి బయటకు వెడులును. ఇది భగవంతుని సృష్టి పాలక గుణమును తెలుపును. దీనినే వేదములు ప్రజాపతిగ చెప్పను. పురాణములలో విష్ణువుగ పేర్కొనబడినది.

'మ' ను ఉచ్చరించునపుడు పెదవులు మూసికొనును. ఇది భగవంతుని సృష్టి ముగింపును సూచించును. ఈ శక్తినే వేదములు 'రుద్ర' పదముతో తెలుపును. పురాణములు మహేశ్వరునిగ పేర్కొనినవి.

ఈ ఓంకార వ్యాఖ్య బ్రాహ్మణాది గ్రంథములలో మరెంతో విపులముగ నున్నది. మాండుక్యోపనిషత్తు అంతయు ఈ ఓం నామ వ్యాఖ్యయే.

ఓ సృష్టి స్థితి లయకర్తయైన దేవా! సర్వప్రాణి సంరక్షకా!

# భూః

గాయత్రీ మంత్రములోని మొదటి భూః, భువః, స్వః అను మూడు పదములను మహావ్యాహృతు లందురు. విశేషముగా ఉచ్చరింపబడునవిగాన వీని కా పేరు గలిగెను. వీనియందు పరమేశ్వరుని లక్షణము స్పష్టముగా చెప్పబడినది. ఈ పదములకు సత్తు, చిత్తు, ఆనందములని యర్థము. సృష్టికి మూలపదార్థములైన పరమేశ్వర జీవ ప్రకృతులలో జీవునిలో ఆనందము, ప్రకృతిలో చిదానందములు లేవు. ఈ మూడు గుణములు కలిగినవాడు పరమేశ్వరు డొక్కడే. కనుక ఈ మూడు మహావ్యాహృతులను కలిపి చెప్పినపుడు పరమేశ్వరుడు మాత్రమే సూచింపబడును. ఇది పరమేశ్వరుని నిర్దుష్ట లక్షణము.

"భూ-సత్తాయాం" అను ధాతుతో 'భూః' పదము తయారగును. భూః అనగా సత్తా-ఉనికి (existance) గలిగిన పదార్థము. పరమేశ్వరుని ఉనికి మూడు కాలములందును ఒకే రకముగ నుండును. సృష్టికి పూర్వమును, సృష్టి కాలమందును, సృష్టికి తదుపరి ప్రళయ కాలమందును పరమేశ్వరుని ఉనికి ఎట్టి మార్పుయు లేక ఏకరసముగ నుండును. మనవలె జనన మరణములు, సుఖదుఃఖములు, వృద్ధిక్షయములు లేనివాడు గనుక పరమేశ్వరుడు నిజమైన సత్ స్వరూపుడు.

"భూ రితివై ప్రాణః" భూః పదము ప్రాణశక్తిని తెలుపును. ప్రపంచమున గల సర్వ ప్రాణులకు ప్రాణశక్తిని ప్రసాదించు వాడు కనుక పరమేశ్వరునకు "భూః" అని పేరు. ఆ ప్రాణశక్తి వలననే మనమంతా జీవించు చున్నాము. మన శరీరములో ప్రాణశక్తి అన్ని కణములను జీవింపజేయునట్లే పరమేశ్వరుడు సర్వప్రాణులను జీవింపజేయు చుండును. మనకు ప్రాణము చాలా ప్రియమైనది. ఆ ప్రియమైన ప్రాణమును యిచ్చువాడు కనుక పరమేశ్వరుడు ప్రాణముకన్న ప్రియ

మైన వాడు. మనము ఎవ్వరికిని ప్రాణములను యివ్వలేము. కనుక ఏ ప్రాణి ప్రాణమును హరించు అధికారము మనకు లేదు. సర్వ ప్రాణు లందరి ప్రాణ రూపమునన్న పరమేశ్వరుని సేవించుటయే నిజమైన "భూః" యొక్క ఆరాధన యగును.

భూరసి, భూమిరసి, అదితిరసి (యజు. 13-18) భూః పదము భూలోక సంజ్ఞావాచకము. జీవులమైన మనకు పరమేశ్వరుడు జన్మ (శరీరము) నిచ్చి మనము వసించుటకు ఆధారముగ ఈ భూమిని సృజించెను. ఈ భూమియందు మన కవసరమగు ఆహార, ఖనిజ, వృక్షాది సర్వ సంపదలను అందుంచెను. ఈ భూమిమీద పండిన పంట లతో మన శరీరము పెరిగి జీవించుచుండును. ఈ భూమి యొక్క అణువులే ఆహారము ద్వారా మన శరీరములో ప్రవేశించి రక్తముగా ప్రవహించు చుండును. కనుక ఏ దేశములో మనము పుట్టి పెరిగి నివసించుచున్నామో ఆ దేశము మనకు తల్లి యగును. "మాతా భూమిః పుత్రోహం పృథివ్యాః" (అథర్వ 12-1-12) 'మాతృభూమి నా తల్లి. నేను ఆమె పుత్రుడను' అను భావము ప్రతి పౌరుడు కలిగి యుండవలెనని వేదము ఆదేశించు చున్నది. అట్టి ఈశ్వర నిర్మితమైన ఈ భూమిని సస్యశ్యామల మొనర్చి దుష్టుల నుండి రక్షించవలెను. 'మాతరం మహీం అదితిన్నామ వచసా కరామహే' (యజు. 18-30) 'సదా శత్రువుల నుండి కాపాడుచు మా మాతృభూమి అఖండితమైనదని ఎలుగెత్తి చాటెదము గాక!" అను ప్రతిజ్ఞను మనము మనోవాక్కాయ కర్మలతో పాటించవలెను. "తుభ్యం బలిహృతః స్యామ" (అథర్వ 14-1-64). అవసరమైనపుడు ఓ మాతృభూమి! నీ రక్షణకై నేను ఆత్మ బలిదానము చేయుదును గాక! అను ప్రతిజ్ఞను పూనవలెను.

సృష్టి స్థితి లయములందు ఏకరసుడైన ఓ సత్స్వరూపా! మేము వసించుటకు భూమిని, జీవించుటకు ప్రాణశక్తిని ఒసంగిన ఓ పరమేశ్వరా!

# భువః

"భువః" పదము ప్రజ్ఞానమును (విశేష జ్ఞానమును) తెలుపును. దీనినే " చిత్తు " అందురు. మన జ్ఞానము పరిమితముగా నుండును. కొన్ని విషయములే మనకు తెలియును. పరమేశ్వరుడు పూర్ణజ్ఞాని, సర్వవ్యాపకుడు నగుటచే అణువులు మొదలు సమస్త బ్రహ్మాండములు తన వశమందుంచుకొని నియమముగా నడిపించు చుండును. సర్వాంతర్యామియై సమస్త జీవులను, వారి సమస్త కర్మలను తెలియుచు వారి వారి కర్మలకు న్యాయముగా ఫలముల నిచ్చుచుండును. తాను నిర్మించిన ఈ సృష్టిలోని సమస్త సత్య విద్యలను వేదము ద్వారా సృష్ట్యాది యందే మానవులందరి కొరకు ఉపదేశించిన జ్ఞానదాత. కనుక పరమేశ్వరుడు భువః (పూర్ణజ్ఞాని - చిత్ స్వరూపుడు).

'భువ రిత్యపానః - యః సర్వం దుఃఖ మపానయతి సోఽపానః' తాను సమస్త దుఃఖరహితుడై తన సంగతిచే జీవులను సమస్త దుఃఖముల నుండి విడివడజేయును గనుక పరమేశ్వరునకు భువః అని పేరు. ఇది మహర్షి దయానందుని నిర్వచనము.

మన శరీరములో అపాన వాయువు మల మూత్ర కఫాదులను వెడలగొట్టి శరీరమును దుఃఖరహితము జేయుచుండును. అట్లే పరమేశ్వరుడు తన ఆజ్ఞను పాలించువారి మనోమాలిన్యములను పోగొట్టి సమస్త దుఃఖములను దూరము జేయును. మనము మనచుట్టు ఎప్పుడు ఏవో దుఃఖములను చూచుచుందుము. మన దుఃఖములను ఋషులు మూడు రకములుగా విభజించిరి. శరీరము ద్వారా కలుగు వివిధ రోగములు, ప్రమాదములు, మృత్యువు మొదలగు శారీరక దుఃఖములను; మనసు ద్వారా కలుగు రాగము, ద్వేషము, అసూయ, భవిష్యత్తును గూర్చి చింత, వివిధ ఊహాలు భయములు, ఆందోళనలు

మొ. మానసిక బాధలను అధ్యాత్మిక దుఃఖము లందురు. ఇతర ప్రాణుల ద్వార అనగా దుష్టుల నుండి, శత్రువులనుండి, విష కీటక సర్పాదుల నుండి కలుగు బాధలను అధి భౌతిక దుఃఖము లందురు. అతివృష్టి, అనావృష్టి, భూకంపములు, ఉప్పెనలు, అధిక శీత అతప ములు మొ.నవి అధిదైవిక దుఃఖము లందురు. ఈ మూడు రకముల దుఃఖముల నుండి పరమేశ్వరుడు వేరుగా నుండును. అతనిని ఈ దుఃఖములు బాధించవు. కనుక పరమేశ్వరునకు భువః అని పేరు.

పరమేశ్వరుడు దుఃఖ నాశకుడగుట వలన అతని మైత్రికోరు మనము కూడ మన చుట్టునుండు ప్రాణుల దుఃఖముల బాప శక్తి కొలది యత్నించవలెను. అదియే 'భువః' యొక్క అరాధనయగును. (భువరితి అంతరిక్ష నామ) భువః పదము అంతరిక్ష సంజ్ఞావాచకము. అంతరిక్ష మనగా వాయువు సంచరించు ప్రదేశము. దీనినే వాతావ రణ మందురు. మనకు భూమి ఆధారమగునట్లే వాతావరణము కూడ ఆధారము. ఆహారము నీరు లేక కొన్ని దినములు బ్రతుకవచ్చును గాని గాలి లేక కొన్ని నిముషములు బ్రతుకుట కష్టము. అట్టి గాలిని మనము పరిశుభ్రముగా నుంచుచు జీవన చక్రములో అనివార్యముగ కలుషితమగుచున్న వాయువును మరల పరిశుభ్రపరచుటకు యత్నించుట మన కర్తవ్యము. అది అగ్నిహోత్రము వలన మాత్రమే సాధ్యపడును. మనము ఉదయ సాయంకాలములందు నిత్యాగ్నిహోత్రులము కావలెను.

ఓ సర్వజ్ఞ పరమేశ్వరా! అంతర్యామివై పాపకార్యములందు మాకు భయాందోళనలు కలిగించి మమ్ము దుఃఖముల నుండి దూరము చేయు పరమేశ్వరా! ప్రాణి మనుగడకు ఆధారమైన వాతావరణమును సృజించిన ఓ చిత్ స్వరూపా!

# స్వాః

'స్వాః' అను పదము ఆనందమును తెలుపును. దుఃఖ స్పర్శలేని నిరంతరముగ నుండు సుఖమునే ఆనంద మందురు. పరమేశ్వరుడు తప్ప మిగిలిన ప్రాణులన్నియు ఏదో రకమైన బాధలను, అటంకము లను, అసంతృప్తిని, అవమానములను పొందుచునే యుండును. ఏ దుఃఖమును తప్పించుకొన్నను ఘరణ దుఃఖమును ఏ ప్రాణియు తప్పించుకొనలేదు. అట్లని ప్రాణులు సుఖమును పొందుట లేదని చెప్పలేము. మానవుడు తనకు అనుకూలమైనవి ప్రాప్తించినపుడు, అనుకున్నవి సాధించినపుడు, పోటీలలో గెలుపొందినపుడు ఆనందమును పొందును. ధనము వలన, బలము వలన, పరివారము వలన, తన అనుచరుల వలన మానవుడు ఆనందమగ్నుడగును. కాని ఇవియన్నియు శాశ్వతములా? వీని వెనుక కష్టములు, భయములు లేవా ? యధా ర్థముగ ఈ సుఖముల వెనుక విషాదచ్ఛాయ లుండును. అంతేగాక మితిమీరిన సుఖానుభవము దుఃఖకారకమే యగును. మన యింద్రియ శక్తులును పరిమితముగ నుండును. గాన ఆ సుఖములను కొద్దికాలమే అనుభవింప గలము. కనుక మన సుఖము దుఃఖమిశ్రితము.

పరమేశ్వరుని ఆనందము స్వాభావికము. త్రికాలములందును ఏక రసముగ నుండును. ఆ ఆనందము మన ఆనందముతో పోల్చ దగినది కాదు. ఆ ఆనందమును వర్ణింప మాటలు చాలవు. అంత ర్యామియైన ఆ ఆనందస్వరూపుని దర్శించిన వ్యక్తి అగ్నిస్పర్శ వలన చలి బాధ పోవునట్లు ఆ ఆనంద స్పర్శ వలన సమస్త దుఃఖములు పోగొట్టుకొని అనిర్వచనీయమైన ఆనందము ననుభవించును. దానినే సమాధి యందురు.

"సమాధి నిర్ధూతమలస్య చేతసో
నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్,

న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే."

స్థిర సమాధితో నిర్మలచితుడైన జీవుడు అంతర్యామియైన ఆనంద సాగరుని దర్శించినపుడు కలుగు సుఖానుభూతిని వర్ణించుటకు మాటలు చాలవు. అది స్వయముగా అంతఃకరణముతో (బుద్ధితో) అనుభవించ వలసినదే.

'స్వ రితి వ్యానః' పరమేశ్వరుడు వ్యాన వాయువు వంటివాడు. మన శరీరములో వ్యాన వాయువు శరీరమంతటను సంచరించుచు ప్రతి కణమునకు ఆహార ప్రాణ వాయువుల నందజేయుచు ప్రతి కణమును జీవింప జేయును. అట్లే పరమేశ్వరుడు సర్వవ్యాపకుడై బ్రహ్మాండమందలి సర్వప్రాణులను పాలించు చుండును. ఆ శక్తినే "స్వః" అందురు.

స్వః పదము స్వర్ లోకమును తెలుపును. ఈ లోకము నందే ఆదిత్య నక్షత్రాదులు ప్రకాశించుచు ప్రాణుల పోషించు చుండును. ఈ బ్రహ్మాండము యొక్క అంతము, అవధి నేటి విజ్ఞానశాస్త్రమున కందకున్నది. కాంతి సం. లతో కొలచినను వందల కాంతి సం.ల దూరమునకు పైగానే కనుబడుచున్నది. అంతటి బ్రహ్మాండము కూడ భగవంతునిలో ఒక పాదముగ (1/4 వంతుగా) నున్నది. "పాదో స్య విశ్వా భూతాని త్రిపాద స్యామృతం దివి" (యజు. 31-3) మిగిలిన మూడు పాదములు (భాగములు) ప్రాణిరహితమైన దివ్యలోకము.

'యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామ న్నధ్యైర యన్త' (యజు. 32-10) ముక్తజీవులు ఈ తృతీయ ధామమునందే నిరాటంకముగ విహరించు చుందురు. అది ఆనంద ధామము. భౌతిక స్వర్ లోకాధిపతియైన సూర్యుని శక్తులు యజ్ఞముల ద్వార బలపరచి మానవ కల్యాణమునకై వినియోగించుటయే "స్వః" ఆరాధన యగును.

ఓ ఆనంద స్వరూప పరమేశ్వరా! సర్వప్రాణి పోషకా! బ్రహ్మాం-డము నంతటిని నీలోనే ఒక భాగముగా కలిగిన ఓ దేవా!

# తత్ సవితుః

సంస్కృత భాషలో తత్ అనగా అతడు, అది యని అర్థము. ఇది ఒక సర్వనామము. ఏది జగత్ప్రసిద్ధమో, దేనిని గూర్చి వేద శాస్త్రములు, ఋషి మునులు, గ్రంథములు విశేషముగ చెప్పుచున్నవో అదియే తత్ - ఆ పరమేశ్వరుడు.

సవితుః ఈ గాయత్రీ మంత్రములో పరమేశ్వరుని సవిత పదముతో చెప్పబడినది. దానివలన ఈ మంత్రమునకు సావిత్రీ మంత్రమను ప్రసిద్ధి కూడ కలిగెను. ఈ సవితా పదము 'షుఞ్ - అభిషవే' మరియు 'షూఙ్ - ప్రాణి గర్భవిమోచనే' అను ధాతువులతో నిర్మితమగును. అభిషవ మనగా ఉత్పత్తి చేయుట. ప్రాణిగర్భ విమోచన మనగా ప్రాణులకు తల్లి గర్భమున శరీరమును లేదా అండమును నిర్మించి, ప్రాణశక్తిని సంచరింపజేసి, గర్భము నుండి బయటకు తీసుకొని వచ్చుట. భగవంతుని ఈ రెండు శక్తులను ఈ పదము సూచించును.

అభిషవ పదము యాజ్ఞవల్క్యుని కాలమున సోమరసము నుత్పాదించు క్రియకు రూఢిగ వాడెడివారు. కాని యిచట పరమేశ్వరుని జగదుత్పాదక శక్తిని సూచించు చున్నది. నిరుక్తము నందు "సవిత - సర్వస్య ప్రసవిత" అని నిర్వచింపబడెను. సంపూర్ణ జగత్తును తమతమ కార్యములందు ప్రేరేపించును గాన సూర్యుడు సవిత అని చెప్పబడెను. ఈ అర్థమునకు "షూ - ప్రేరణే" అను ధాతువు మూలము. కాని ఈ మంత్రము బుద్ధి కొరకు చేయుప్రార్థన. ఆ బుద్ధి సూర్యునియందు లేదు, గాన అంతర్యామియై సర్వప్రాణులకు ప్రేరణ కలిగించు పరమేశ్వరునికే సవితా పదము వర్తించును. ఈ ప్రపంచమునకు మూలకారణమైన ప్రకృతి సత్వ రజో తమో గుణములను మూడు గుణములను కలిగి యుండును. ఈ మూడు గుణములు సామ్యావస్థలో నున్నపుడు సృష్టి తెలియబడదు. అంధకారముగ, శూన్యముగ ప్రతీత మగును. దానినే ప్రళయ మందురు. పరమేశ్వరుడు తన

య్యాక్షణముతో ఆ సామ్యావస్థను భంగపరచి నియమబద్ధముగ ఈ ప్రపంచమును నిర్మించెను. జీవులు పూర్వ సృష్టిలో చేసిన కర్మల ఫలముల నిచ్చుటకై వివిధ ప్రాణులను సృజించెను. అందుచే ఈశ్వరుడు సవిత - సృష్టికర్త. సృష్టి సర్వత్ర సర్వకాలము లందును జరుగుచుండును గాన సవితా దేవతయును సర్వవ్యాపకము. వేదము సవితను యిట్లు వర్ణించు చున్నది -

"సవితా పశ్చాతాత్ పురస్తాత్ సవితోత్తరాత్

సవితోధరాత్! సవితా నః సువతు సర్వతాతి

సవితానో రాసతాం దీర్ఘమాయుః" (ఋ. 10-36-14)

సృష్టికర్తయైన పరమేశ్వరుడు ముందు, వెనుక, క్రింద, పైన అనగా అన్ని వైపుల అంతటా వ్యాపించి సర్వత్ర సృష్టిని గావించుచు మనను రక్షించుచున్నాడు. అంతర్యామియై ప్రేరేపించుచు మనలను కర్మశీలుర జేయుచున్నాడు. అతడు మాకు శుభములను, దీర్ఘాయువును ప్రసాదించు గాక!

అంతర్యామియైన పరమేశ్వరుని ఈ సవితా శక్తియే మనలను కర్మలయందు ప్రేరేపించును. ఆ ప్రేరణ వలననే మానవుడు కర్మశీలుడై, ఆలోచనాపరుడై కవితలను, కవిత్వములను సృజించెను. వాస్తు, శిల్ప, వైద్య, రసాయన, ఖగోళ శాస్త్రాలలో అద్భుతమైన ఆవిష్కారములను సాధించెను. అనేక సుఖ సాధనములతో బాటు బుద్ధికి ప్రతిరూపమైన కంప్యూటర్లను నిర్మించెను. ప్రపంచమున గల సమస్త విజ్ఞాన ఆవిష్కారముల వెనుక ఈ సవితాశక్తి ప్రేరణయే గలదు. ఆ ప్రేరణ మానవ కల్యాణమునకై వినియోగించుట మన కర్తవ్యము.

ఓ సృష్టికర్తయైన పరమేశ్వరా! మాకు శరీరములను నిర్మించి యిచ్చిన ఓ తండ్రి! నీ ప్రేరణతో మా బుద్ధి వికసించి మేము విజ్ఞానవంతులము, ధర్మాత్ములము అగుదుము గాక!

# వరేణ్యం

'వృ - వరణే' అను ధాతువుతో వరేణ్య పద మేర్పడును. వరింప- కోరదగినవాడు అని దీని యర్థము. "యద్ వరేణ్యం వర్తుం అర్హమ్, యత్ శ్రేష్టం - తత్ వరేణ్యం" అని నిర్వచనము. వధూ వర పదములు కూడ ఈ ధాతువుతోనే నిర్మితమగును. ఒకరిని ఒకరు మనసార కోరుకున్నవారు కనుక వారి కా  పేరు వచ్చెను.

సామాన్య మానవుల దృష్టిలో లోకములో ప్రధానముగ కోరద గినవి ధనధాన్యములు, భోగభాగ్యములు. వాటి వలననే సర్వసుఖములు లభించునని వారి యుద్దేశ్యము. కాని ఆ సుఖము తాత్కాలికమై నదియే. ఏకాంగమే. ధనవంతులంతా సుఖపడుచున్నారా ? అని ప్రశ్నించుకొన్నచో వారే ఎక్కువ అసంతృప్తితో జీవించుచున్నారని తెలి యును. ప్రపంచమున ఈశ్వరప్రాప్తిని మించిన సుఖము, తృప్తి మరే- దియును లేదు. సన్మిత్రులు, భార్యాభర్తలు ఒకరికొకరు కోరతగినవారే కాని వారి మిత్రత, అనురాగము ఎంత కాలముండునో చెప్పలేము. వారు మనవెంట కొంతకాలము నడిచినను మనము ఈ శరీరమును వదలి వెళ్ళునప్పుడు మనతో రాలేరు. పరమేశ్వరుడు అన్ని వేళల యందును జన్మజన్మాంతరము లందును మనకు తోడుగా నుండును. అందు చేతనే వేదము 'ఇంద్రస్య యుజ్య సఖా' (ఋ. 1-12-19) పరమేశ్వరుడే నీకు నిజమైన మిత్రుడని చెప్పను.

ఈశ్వరుడు ఆనంద స్వరూపుడు గనుక సర్వప్రాణుల చేత గోరద గినవాడు. దుష్టులు, దుర్మార్గులు చివరకు నాస్తికులు కూడ ఆనందమును గోరుదురు. కనుక పరోక్షముగ ఈశ్వరుని గోరినట్లే యగును. నాస్తికులు ఈశ్వరుని ఆనంద స్వరూపునిగా నంగీకరింపరు. ఇది కేవలము మన మనోభావన యని వారి వాదన. కాని వారు గాఢనిద్ర వలన అనిర్వచనీయమైన సుఖము కలుగునని ఒప్పకుందురు. గాఢనిద్ర వలన మనకెంతయో సుఖము కలుగునను మాట అందరికీ తెలిసిన

విషయమే. అలసిన శరీరమునకు, మనసునకు ఆహార విశ్రాంతుల కన్నను నిద్ర వలన ఎక్కువ మేలు కలుగును. శరీరము, నాడులు, మనసు నిద్ర వలన పునరుజ్జీవములగును. సుఖముగ నిద్రించితిమని మనసార చెప్పెదురు. నిద్ర వలన ఈ సుఖము ఎక్కడి నుండి వచ్చినదో నేటి అధునిక వైద్యశాస్త్రము చెప్పలేకున్నది. భారతీయ తత్త్వవేత్తలు ఆ సుఖానుభవము పరమేశ్వరుని నుండి లభించునట్లు చెప్పెదురు. గాఢనిద్రలో మనకు తెలియకనే ఆనందసాగరుడైన భగవంతునిలో మునక వేసి వచ్చుచుందుము. అదే జాగ్రదావస్థలో చేయగలిగిన ఆ ఆనందమేమియో మనకు తెలసి యుండెడిది.

నిజమైన వధూవరులు ఎట్లు ఒకటిగ - ఒకే మాటగ, ఒకే బాటగా జీవింతురో, ఎట్లు వారిని విడదీయలేమో అట్లే భగవంతుని వరించుట వలన మనకు భగవంతునకు ఒక బంధమేర్పడును. దాని వలన ఈశ్వరాజ్ఞాపాలనయే మన జీవన పరమావధి యగును. మన బలహీనతలన్నియు నశించి మనము ధర్మాత్ములము, పుణ్యజీవులము నగుదుము.

వరేణ్య పదమునకు శ్రేష్ఠుడని మరియొక అర్థము. శ్రేష్ఠపురుషుని నాయకునిగ ఎన్నుకొన్న ప్రజలు తమ చింతలన్నింటిని నాయకునిపై వదలి దిగులు లేక జీవింతురు. అంతకన్నను శ్రేష్ఠతముడైన భగవంతుని నాయకునిగ చేసుకొన్న వారికి దిగులే ముండును ? ప్రపంచములో మనము మన పరిధిలో లేని భారము లెన్నిటినో మనపైన వేసుకొని ఎంతో అశాంతితో జీవించు చుందుము. భగవంతుని మన నాయకునిగ ఎన్నుకొని అయనపైననే మన భారములన్నీ వేసి అయన అజ్ఞలైన వేదవిహిత కర్మలను ఫలాపేక్ష లేక కర్తవ్య భావముతో అచరించుచున్న అశాంతి తొలగిపోయి పరమ శాంతిని పొందుదుము.

ఓ వరింపదగిన మిత్రమా పరమేశ్వరా! మమ్ము నీవే నడిపింపుము. ఓ శ్రేష్ఠనాయకా! నీ నాయకత్వమున మేము శాంత చిత్తుల మగుదుము గాక!

# భర్గః

"భ్రస్జ - పాకే, భ్రుజీ భర్జనే" అను ధాతువులతో 'భర్గః' పదమేర్పడును. పాపరహితుడు, పాపనాశకుడు నని ఈ పదమున కర్థము. "భుజ్యంతి పాపాని దుఃఖ మూలాని యేన తత్ భర్గః" అని నిర్వచనము. మనము చేయుపనులు ధర్మయుక్తము, న్యాయయుక్తము అయినపుడు పుణ్యకర్మ లగును. అవే అధర్మయుక్తము, అన్యాయ యుక్తము నైనపుడు పాప కర్మలగును. పరమేశ్వరుడు జీవులు చేయు కర్మలకు న్యాయాధీశుని వలె న్యాయముగ ఫలముల నిచ్చును. గాన అతడు న్యాయకారి-న్యాయాధికారి. అందుచే అతడు పాపరహితుడు. ఎవరు అతనిని ఉపాసింతురో అట్టి వారిని సత్కర్మల యందు ప్రేరే పించును. పాపకార్యము లందు భయాందోళనలు కలిగించి వాటి నుండి దూరము చేయును. అందుచే అతడు పాపనాశకుడు.

భర్గః పదమునకు విశుద్ధమైన ప్రకాశమని మరియొక అర్థము. కోట్లాది సూర్యుల ప్రకాశముకూడ ఆ ప్రకాశమునకు సరిరాదు. మన ఆత్మకూడ ప్రకాశము గలదే కాని పరమేశ్వరునంత ప్రకాశవంతమైనది కాదు. కామక్రోధాది మాలిన్యములతో ప్రకాశరహితముగా నున్నది. దానిని పరంజ్యోతియైన భర్గః దేవుని ప్రకాశముతో శుద్ధపరచుకోవలసి యుండును. బంగారము కొలిమిలో కరిగి తన మాలిన్యములను పోగొ ట్టుకొనునట్లు మన ఆత్మ పరమాత్మ ప్రకాశముతో తన కామక్రోధాది మాలిన్యములను పోగొట్టుకొని దేదీప్యమానమై ప్రకాశించును.

భర్గః పదమునకు విశుద్ధ జ్ఞానమని మరియొక అర్థము. పరమే శ్వరుడు సర్వజ్ఞుడు. జీవుని జ్ఞానము అల్పముగ భ్రమ ప్రమాదములతో కూడియుండును. అట్టి జ్ఞానమును విశుద్ధ పరచుకొనుటకు భర్గః దేవుని ఉపాసించవలసి యున్నది. అతని నుపాసించుట వలన అగ్ని సామీప్య మున చలి దూరమగునట్లు మన అవిద్యా, అజ్ఞానము తొలగి మనకు

జ్ఞానవికాసము కలుగును. మనము జీవించు ఈ ప్రపంచములో అనేక చీకటి దారులు గలవు. అనేక కోరికలు ఇంద్రియములను తమ వైపు ఆకర్షించును. అట్టి స్థితిలో ఏది సరియైన మార్గమో మనకు స్పష్టముగ గోచరించదు. మన కోరికలు మనను తప్పు మార్గమును పట్టించి అంధ కారము లోనికి గొనిపోవును. అనేక జీవితానుభవముల నను భవించినను సరైన మార్గమేదో మనము నిర్ణయింపలేక వివశుల మగుచుందుము. అప్పుడే మనకు జ్ఞాన ప్రకాశ మవసరము. భర్గః దేవుని ప్రకాశము మనకప్పు డవసర మగును. ఆ విశుద్ధ ప్రకాశములో మన అజ్ఞానపు తెరలు తొలగిపోయి మనకు సరైన మార్గము గోచరించును.

నేడు లోకములో భర్గః పదము పురాణోక్త కైలాసాధిపతియైన శివనామముగ ప్రచారము చెందినది. కాని, పరమేశ్వరుడు ఏకదేశవాసి కాడు. సర్వవ్యాపకుడని, సర్వత్ర సమానముగ వ్యాపించి యున్నాడని వేదము నొక్కి వక్కాణించుచున్నది. "స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగం శుద్ధ మపాప విద్ధమ్! " అతడు సర్వవ్యాపకుడు, సర్వశక్తి మంతుడు, స్థూల-సూక్ష్మ-కారణ శరీర రహితుడు, వ్రణ(లోప) రహితుడు, నాడీ బంధన రహితుడు, శుద్ధుడు (పాపరహితుడు) నని వేదము నొక్కి వక్కాణించు చున్నది. కనుక కైలాసాధిపతియైన శివుడు కల్పిత పురుషుడు.

భర్గః దేవుని తన హృదయమున స్థాపించుకొన్న వ్యక్తి జీవితము ప్రకాశవంత మగును. అతని గుణకర్మలన్నియు ఆదర్శవంత మగును. మనోవాక్కాయ కర్మలు పాపరహిత మగును.

ఓ న్యాయకారియైన పరమేశ్వరా ! నీవు పాపరహితుడవు. పాప-ముచే నంటబడని వాడవు. సర్వజ్ఞుడవు, విశుద్ధజ్యోతివి. నీ అనుగ్రహము వలన మేమును అట్లే యగుదుము గాక!

# దేవస్య

"దేవస్య" అనగా ముందు వర్ణించిన దివ్యగుణ యుక్తుడైన దేవుని యొక్క స్వరూపమని యర్థము. దేవ పదము చాలా విశాలమైన అర్థము గలది. దివ్య (గొప్ప) గుణములు కలిగిన వ్యక్తులను, పదార్థములను దేవత లనవచ్చును. అందుచేతనే యాస్క మహర్షి నిరుక్తమున 'దేవో దానాద్ వా, దీపనాద్ వా, ద్యుస్థానాద్ వా,' అని నిర్వచించెను. దానశీలురు, గొప్ప భావములతో ప్రకాశించువారు, ద్యులోకమున నుండు సూర్యచంద్ర నక్షత్రాదులు దేవత లనబడుదురు. ఈ దేవతలను స్థూలముగ జడ, చేతన దేవతలని రెండుగా విభజించవచ్చును. అందు పంచభూతములు, సూర్యచంద్ర నక్షత్రాదులు జడ దేవతలు. చేతన (జ్ఞాన) దేవతలలో తల్లి, తండ్రి, విద్య నేర్పిన ఆచార్యుడు, ధర్మ ప్రచారము చేయు అతిథి మొదటగా లెక్కించదగినవారు. విద్వాంసులు, వీరులు, కళాకారులు, దేశభక్తులు, సేవాపరాయణులు మొదలగు వారందరిని గూడ దేవత లనవచ్చును. ప్రకరణము (context) ను బట్టి ఈ గాయత్రీ మంత్రములో దేవ పదము దేవతలందరికి దేవతయైన పరమేశ్వరునికి వర్తించును. అందువలననే ఋషులు 'ఏకో దేవః సర్వభూతేషు గూఢా సర్వవ్యాపి సర్వభూతాంతరాత్మా' (శ్వేతాశ్వతర ఉపనిషత్తు 6-11) అని కీర్తించిరి. అనగా దేవుడు ఒక్కడే. అతడే ఈ ప్రపంచమంతయు వ్యాపించి సర్వభూతము లందును అంతర్యామియై గూఢముగ నున్నాడు.

"దివు - క్రీడా విజిగీష వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు" అను ధాతువుతో 'దేవ' పదము తయారగును. పరసహాయము లేక క్రీడగా ఈ జగత్తును జేయునాడును, సదా విజయ శీలుడును, న్యాయాన్యాయ వ్యవహార విజ్ఞుడును, స్వయం ప్రకాశ స్వరూపుడును, స్తుతింప దగినవాడును, ఆనంద స్వరూపు

డును, మదోన్మత్తులను తాడించువాడును, స్వప్న - జీవులకు విశ్రాంతి నిచ్చువాడును, కాంతి - కామించుటకు యోగ్యుడును, గతిశీలుడును నగుటచే పరమేశ్వరునకు 'దేవుడు' అని పేరు.

సూర్యచంద్రులు ప్రకాశించుటవలన అవి దేవత లనబడును. కాని వాటికి ప్రకాశను నిచ్చు దివ్యజ్యోతి దేవుడే. ఆ పరమేశ్వరుని వలననే దేవతలని చెప్పబడు వాయువు వీచుచున్నది. అగ్ని దహించుచు న్నది. నీరు ప్రవహించుచున్నది. ఆ పరమేశ్వర సహకారము లేనిదే ఒక్క గడ్డి పోచను కూడా యివి ఏమియు చేయజాలవు.

లోకములో దేవతలు ముప్పదిమూడు కోట్లు గలరని వినుచుం దుము వీరందరు స్వర్గములో దేవేంద్రుని నాయకత్వమున వివిధ సృష్టి కార్యములు చేయుచుందురని పురాణములలో గలదు. కాని వేద శాస్త్రములలో దేవతలు ముప్పది మూడుగానే లెక్కించబడినవి.

యజుర్వేదమున "త్రయస్త్రింశతా" (14-31) అని చెప్పబడి నది. దీనికి వ్యాఖ్యానముగ శతపథ బ్రాహ్మణమునందు ఈ విధముగ లెక్కించబడెను. సమస్త సృష్టికి నివాస స్థానములగు అష్ట వసు వులు (పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు నక్షత్రములు), జీవుడు శరీరమును వదలి నపుడు నేడ్పించు పదునొకండు రుద్రులు (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయములను దశ ప్రాణములు. పదునొకండవదియైన జీవాత్మ), ద్వాదశ ఆదిత్యులు (సంవత్సరములోని పన్నెండు మాసములు), పరమేశ్వరమునకు హేతువగుటచే ఇంద్రుడను మెరుపు; ప్రజలను పోషించుచుండు ప్రజాపతియను యజ్ఞము కలిసి ముప్పది మూడు యగును. వీని కన్నిటికిని స్వామియు, అన్నిటికంటే గొప్పవాడు నగుటచే పరమాత్మ ముప్పది నాలుగవ దేవత యగును. అతనిని మాత్రమే ఉపాసించవలెనని శతపథ బ్రాహ్మణమునందు స్పష్ట ముగ వ్రాయబడినది.

**దేవతలకు దేవతయైన ఓ మహాదేవ! నీవు అనేక దివ్య గుణము-లతో ప్రకాశించువాడవు. నీ అనుగ్రహమున మేమును దివ్యగుణ యుక్తుల మగుదుము గాక!**

# ధీమహి

'ధీమహి' అనగా ధ్యానము చేయుదుము గాక యని అర్ధము. అనగా పరమేశ్వరుని దివ్యగుణములను మన మనస్సు నందు నిరంత రాయముగ ధారణ చేయుట. ఈ పదము మనను ధ్యానాభ్యాసము చేయుటకు ప్రేరేపించు చున్నది. సంధ్యయను పదము నందు కూడ యిదే అర్ధము కలదు. సం- చక్కగా, ధ్యా- ధ్యానము చేయుట.

మనము ఏకాంతమున ఆసన బద్ధులమై కళ్ళు మూసుకొని మన సును హృదయ స్థానమున నిలిపి భగవంతుని ప్రార్ధన జేయవలెను. మనము ప్రార్ధన చేయుచున్నపుడు చంచలమైన మనస్సు ప్రాపంచిక విషయముల వైపే పోవుచుండును. అందుచే ప్రయత్నపూర్వకముగ మనస్సును విషయముల నుండి మరలించి హృదయస్థానమున నిలు పుచు పరమేశ్వర గుణములను మననము చేయవలెను. నాలుగు వైపుల, క్రింద, పైన పరమేశ్వరుడే వ్యాపించి సర్వవిధముల మనను సంరక్షించు చున్నాడను భావము మననము చేయవలెను. యజుర్వేద ములోని (అధ్యా. 34) మనసా పరిక్రమ మంత్రములలో యిదే భావన గలదు. మనస్సును నిలుపుటకు ఈ మనసా పరిక్రమ మంత్రములు మననము చేయుట మంచిది. ఎచటెచటకు మనసు పరుగిడునో అచట చట పరమేశ్వరుడే వ్యాపించి యున్నాడను భావన వలన మనసు విసిగి చివరకు తన స్వస్థానమైన హృదయమును చేరును. లోకములో పరమే శ్వరుని మించిన వరింపదగిన (కోరదగిన) శ్రేష్ఠ పదార్థము మరియొకటి ఏమి కలదు?

షోడశోపచార పూజాదికములన్నియు మనసును చలింపచేయున వియే కాని ఏకాగ్రపరప లేవు. పూజలో మనము చేయు ప్రతిక్రియ మన చిత్తములో (మనసులో) వృత్తిని (కదలికను) కలిగించును. చిత్త వృత్తులను నిరోధించుటయే ఈశ్వర సాక్షాత్కారమునకు మార్గమగును

కాని చిత్తవృత్తులను పెంచునవి మార్గములు కావు. పతంజలి మహర్షి సూచించిన అష్టాంగయోగ మార్గమొక్కటియే ఈశ్వర సాక్షాత్కార మునకు అందరకు అనుకూలమైన రాజమార్గము.

భౌతిక విద్యల అభ్యాసమునకు కూడ మనో ఏకాగ్రత అత్యవస రము. ఎవరు తాము నేర్చు పనియందు మనసును ఎంత ఎక్కువగా ఏకాగ్ర పరపగలరో వారా కళ యందు గొప్ప ప్రావీణ్యులగుదురు. ఈ సాధన నిత్య జీవితములో మనకెంతో సహకారి యగును. ముఖ్య ముగ విద్యార్థుల కిది ఉపయుక్తము. అందుచేతనే ప్రాచీన కాలములో విద్యాభ్యాసమునకు బంపు ముందు గాయత్రీ ఉపదేశము చేసి సంధ్యా వందనము నేర్పెడివారు.

మనో ఏకాగ్రతకు చిత్త ప్రసన్నత కూడ అత్యవసరము. "మైత్రీ కరుణా ముది తోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాతః చిత్త ప్రసాదనమ్" (యోగదర్శనము 1-33) తనతో సమా నులైన వారియందు మైత్రి, ఉన్నతి చెందు వారి యెడ ముదిత (సంతోషము), దీనుల పట్ల కరుణ, దుర్మార్గులపట్ల ఉపేక్ష కలిగి యుండుట వలన చిత్త ప్రసన్నత కలుగును. ముముక్షువు ప్రతినిత్యము కనీసము రెండు గంటలయినను మనస్సు మొదలగు సూక్ష్మపదార్థములు సాక్షాత్కారమగుటకు అవశ్యముగా ధ్యానము చేయవలెను. భగవంతుని ధ్యానము చేయగల వ్యక్తి తానెట్టి స్థితిలోనున్నను దివ్యానందము నొందును. చాల తృప్తితో జీవితము గడుపును.

హే సర్వేశ్వరా ! సర్వ వ్యాపకుడవై, సర్వవిధముల సంరక్షించు నీవు నాకు అత్యంత సన్నిహితుడవై, అంతర్యామివై యున్నావు. అట్టి నిన్ను మా హృదయమున ధ్యానింతుము గాక ! దివ్యానందము నొందు- దుము గాక !

# ధియః

'ధియః' అనగా బుద్ధులని యర్థము. బుద్ధి యనగా మానవులలోని అంతరింద్రియము. దేనివలన చూచి, చదివి, తెలిసికొని జ్ఞానవంతుల మగుదుమో దానిని బుద్ధి యందురు. దీని వలననే మానవుడు క్రొత్త క్రొత్త ప్రయోగములు చేసి విజ్ఞానము నభివృద్ధి చేసుకొనుచున్నాడు. దీని వలననే మానవుడు సత్యాసత్యములను, ధర్మాధర్మములను, కర్త వ్యాకర్తవ్యములను వేరువేరుగా తెలిసికొని ధర్మాత్ముడు, సభ్యుడు కాగలుగు చున్నాడు.

పరమేశ్వరుని దివ్య గుణముల ధ్యానములో ఆనందమగ్నులమైన మనము భగవంతుని ఏమి కోరవలెను - ధన ధాన్యములనా ? భోగ భాగ్యములనా ? గౌరవాధికారములనా ? ఆరోగ్య దీర్ఘజీవనములనా ? కాని, ఇవి యన్నియు భగవంతుని స్వరూపమును, కర్మ సిద్ధాంత మును తెలియని వారు కోరుదురు భగవంతుని ధ్యానించు వారికి యివి యన్నియు తుచ్ఛముగ గోచరించును. ఈ ప్రాపంచిక భోగములన్నియు మానవుడు ప్రయత్నించి పొందగలడు. ఈ జన్మలో గాని, పూర్వజ న్మలో గాని పుణ్యకార్యములాచరింపనిది కేవలము ప్రార్థనల వలన యివి లభింపవు. ధర్మాత్మునకు - పుణ్యజీవికి ప్రార్థింపకున్నను యివి లభించును.

మరి, భగవంతుని ఏమి కోరవలెను ? దేని వలన మానవుడు మిగిలిన జీవరాసుల కన్న ఉన్నతముగ నున్నాడో, దేనివలన ప్రాపం చిక వస్తువులన్నిటిని సాధించగలుగుచున్నాడో అట్టి బుద్ధిని కోరవలెను. అదియే నిజమైన ప్రార్థన యగును. ఆ బుద్ధి ప్రపంచములో దొరుకు వస్తువు కాదు. ప్రయత్నించి పొందవలసినది. దానికి పరమేశ్వరుని అనుగ్రహము కూడ కావలసి యున్నది.

నిత్య జీవితములో ఈ బుద్ధి యొక్క అవసరము ఎంతగానో యున్నది. అనేక మోసములతో కూడిన ఈ ప్రపంచములో బ్రతుకుట కిది ఒక జీవనావసరము. కల్తీ వస్తువుల నుండి మంచి వస్తువులను వేరు చేయుటకు, అసత్యమునుండి సత్యమును వేరు చేయుటకు, చెడు నుండి మంచిని వేరు చేయుటకు ఈ బుద్ధి అవసరమగును. ఇది లేకున్న ఎన్నో సమస్య లుత్పన్న మగును. అనేక సందేహములు ఉక్కిరి బిక్కిరి జేయును. సత్యము గోచరింపదు. అప్పుడు ఈ బుద్ధి యొక్క ప్రకాశ మవసరమగును. పరిశోధకులకు కలుగు అనేక సందేహములను తీర్చునది ఈ బుద్ధియే. వైజ్ఞానిక పురోగతికి, శాస్త్రకళారంగముల యభివృద్ధికి, సామాజిక జీవన వికాసానికి బుద్ధి యొక్క అవసరమెంతగానో యున్నది. అన్నిటిని మించి, మానవ జీవన లక్ష్యమైన దుఃఖరాహిత్య స్థితి (మోక్షమును) జేర్చుటకు దీని అవసరము ప్రధానముగ నున్నది.

మానవుడు ఈ బుద్ధి సహాయమున జీవన రంగములో ఉన్నతోన్నత స్థానములు చేరుకోగలడు. లోకములో విద్యావంతునికి గౌరవ మర్యాదలు, ఆదర సత్కారములు లభించుచుండుట అందరికీ విదితమైన విషయమే. ఉపనిషత్తులలో బుద్ధి జీవునకు ఒక సారథిగా వర్ణింపబడినది. బుద్ధిమంతుడైన సారధి గుఱ్ఱములను సరియైన మార్గములో నడిపించి అనుకున్న గమ్యమునకు చేర్చునట్లు మంచి బుద్ధి మానవుని తన ఆశయశిఖరములకు జేర్చును. అందుచేతనే ఈ గాయత్రీ మంత్రమందు ఈ ప్రపంచములోని సర్వోత్తమమైన బుద్ధి కొరకు ప్రార్థన గలదు.

అంతర్యామియైన ఓ పరమేశ్వరా ! నీవు సర్వజ్ఞుడవు, పూర్ణజ్ఞానివి. నీ అనుగ్రహమున మేమును జ్ఞానవంతుల మగుదుము గాక! పరమ సుఖముల ననుభవింతుము గాక !

# "యః నః ప్రచోదయాత్"

'యః' అనగా ఆ పరమేశ్వరుడు. ఎవరిని మనము బుద్ధి కొరకు ప్రార్థించితిమో, ఎవరు పాపరహితుడు, శ్రేష్ఠుడునో అట్టి పరమేశ్వరుడు.

'నః' అనగా మాకు యని అర్థము. ఈ గాయత్రీ మంత్రములో ఎవరి బుద్ధి కొరకు ప్రార్థించితిమి ? కేవలము మన ఒక్కరి బుద్ధి కొరకే గాదు. మన తోటి మానవులందరి బుద్ధి కొరకు ప్రార్థించ వలెనని ఈ పదము సూచించుచున్నది. వైదిక ప్రార్థన లన్నియు సామూహిక ప్రార్థనలుగానే యుండును. మానవుడు సామాజిక ప్రాణి. ఇతరుల సహకారము లేనిదే ఒంటరిగ జీవించలేడు. అందు వలన తనను ఒక సమిష్టి ప్రాణిగా గుర్తించి 'అందరి ఉన్నతిలోనే తన ఉన్నతిని' చూచుచు భౌతిక రంగముననే గాక ఆధ్యాత్మిక రంగములో కూడ యిటువంటి భావనయే కలిగియుండవలెనని ఈ పదము సూచించుచు న్నది. అందుచే మన అందరి బుద్ధి కొరకు ప్రార్థన చేయవలెను.

'ప్రచోదయాత్' అనగా వికసింపజేయుము అని యర్థము. అంద రిలోను ఎంతో కొంత బుద్ధి యుండును. అది ఎంత వికసించిన మానవు డంత ఉన్నతి చెందును. సూర్యకిరణ స్పర్శతో కమలము వికసించినట్లు అంతర్యామియైన భర్గః సూర్యుని అనుగ్రహమున సంకుచి తమైన మన బుద్ధి వికాసము నొందవలెనని కోరుచున్నాము. మానవుడు తాను ఈ లోకమునకు ఒంటరిగా వచ్చినను ప్రపంచములో కొందరితో మమకారబంధ మేర్పరచుకొనును. ఆ మమకార పరిధిలోని వారే దన వారనియు, మిగిలిన వారు పరులనియు తలంచును. తన కొరకు, తన వారి కొరకు పరులను బాధించుట కూడ జరుగును. తద్వారా దుఃఖముల పాలగును. అట్టి సంకుచిత భావము పోగొట్టు కొనవలెనని ఈ పదము సూచించు చున్నది.

'ప్రచోదయాత్' అనగా ప్ర - చక్కగ, చోదయాత్ - ప్రేరేపించుము యని మరియొక అర్థము. సూర్యోదయము వలన చీకటి దూరమై మార్గములు స్పష్టమగును. ఈ అజ్ఞానాంధకార ప్రపంచములో జీవన పథికుడైన జీవునకు సరైన మార్గమేదో గోచరింపవలెనన్న భర్గః సూర్యుడు మన హృదయములో ఉదయింపవలెను. బుద్ధి అనునది ఒక బలమైన పనిముట్టు మాత్రమే. ఆ పనిముట్టుతో మనము మంచిపనులైనను చేయవచ్చును లేదా చెడుపనులైనను చేయవచ్చును. అట్లే బుద్ధి బలముతో మానవుడు గొప్ప ఆదర్శ పురుషుడు కావచ్చును లేదా రాక్షసుడు కూడ కాగలడు.

అందుచెతనే వేదము లందు ఒక చక్కటి ప్రార్థన కలదు - "శన్నో దేవా విశ్వదేవా భవంతు" - ఓ పరమేశ్వరా ! మా దేవతలు-విద్వాంసులు విశ్వదేవతలు - విశ్వమానవులందరి కొరకు దేవతలై ప్రపంచ శాంతిని నెలగొల్పుదురు గాక యని భావము. నేడు వైజ్ఞానిక బలముతోనే అనేక ఆయుధములు, అణుబాంబు వంటి ప్రపంచనాశక మారణాయుధములు కని పెట్టబడుచున్నవి. ఆ వైజ్ఞానికులు తమ దేశీయులకు, తమ నాయకులకు దేవతలే కాని మానవమాత్రు లందరకు కాదు. సామాన్య దుర్మార్గుని కన్నను ఎక్కువ బుద్ధి కలిగిన దుర్మార్గుని వలన ఎక్కువ నష్టము జరుగును. "సాక్షరాః రాక్షసాః భవంతి" - అను లోకోక్తి యిట్టి సందర్భము లందు సత్యమగుచున్నది. కనుక ప్రార్థన యొక్క లక్ష్యము స్వార్థ ప్రయోజనము కొరకు గాక విశ్వకల్యాణము కొరకుగా నుండవలెను. అట్టి సర్వోత్తమ ప్రార్థన ఈ గాయత్రీ మంత్రము నందు గనబడుచున్నది. కనుక యిది మహోన్నతమైన గాయత్రి.

ఓ సర్వవ్యాపక ! సచ్చిదానంద స్వరూప ! అంతర్యామియైన ఓ పరమేశ్వర ! మాకు సద్బుద్ధి నిచ్చి సత్కర్మల యందు ప్రేరేపించి అభ్యుదయ నిశ్రేయసములను ప్రాప్తింప జేయుము.

# అనుష్ఠానము

గాయత్రీ మంత్రము జప మంత్రము. ప్రతి నిత్యము ఉదయ సాయం సంధ్యా సమయములలో శుద్ధులై ఏకాంతమున ఆసీనులై హృదయస్థానమున మనస్సును నిలిపి పరమేశ్వరుని సచ్చిదానంద స్వరూపమును ధారణ చేయుచు శక్తి కొలది గాయత్రీ జపము చేయవలెను.

నేడు లోకములో అనేక సంధ్యావందన విధులు (సాంప్రదాయములు) గలవు. అందు మానవునికి సమగ్ర ఉన్నతిని కలిగించి యోగిని చేయగల సామర్ధ్యము మహర్షి దయానందునిచే సంకలనము చేయబడిన సంధ్యావందన విధి యందు మాత్రమే గలదు. అన్నియు వేదమంత్రములే గల ఈ సంధ్యావందన విధి యందు మానవుడు తన కొరకు ఏమి ఆచరించవలెనో పరులతో ఎట్లు మెలగ వలెనో, ఆత్మోన్నతి కొరకు ఏమి చేయవలెనో నిర్దేశింపబడినది. ఇంతేగాక, చంచలమైన మనస్సును స్వాధీనపరచుకొని అంతర్ముఖము చేయుటకు వలయు సాధనము లందున్నవి. అర్థసహితముగ ఆ విధిని నేర్చుకొనుట శ్రేష్ఠము. మీకు దగ్గరలోనున్న ఏ ఆర్యసమాజమునకు వెళ్ళినను ఆ విధి నేర్చుకొనవచ్చును.

## ఎప్పుడు జపించవలెను ?

మహర్షి యాజ్ఞవల్క్యుడు సంధ్యా, గాయత్రీ జప సమయముల గూర్చి యిట్లు వివరించెను -

శ్లో.జప న్నాసీత సావిత్రీం ప్రత్యగాతారకోదయాత్

సంధ్యా ప్రాక్ ప్రాత రేవం హి తిష్ఠే దా సూర్య దర్శనాత్

(యజ్ఞవల్క్య స్మృతి, ఆచారాధ్యాయము - 245)

సాయంకాలము సూర్యాస్తమయము మొదలు నక్షత్రోదయ మగు వరకు, ప్రాతఃకాలము నక్షత్రాస్తమయము (నక్షత్రములు కనపడకుండా పోయినది) మొదలు సూర్యోదయమగు వరకు నుండు సంధ్యా సమయములలో సావిత్రీ (గాయత్రీ) మంత్రమును జపించుటకు ఆసీనుడు కావలెను.

అనివార్య కారణముల వలన ఆ సమయములందు గాయత్రిని జపించుటకు వీలు పడకున్న అసలు మానుకొనుటకంటె వీలైన ఏదో ఒక సమయమున చేయుట మంచిది. అందువలన ఏదో అశుభము జరుగునని భయపడనక్కరలేదు. ఋషుల యభిప్రాయము మనో ఏకాగ్రతకు సంధ్యా సమయము ఎక్కువ అనుకూలమనియే.

## ఎన్ని సార్లు జపించవలెను ?

శ్లో.సహస్ర పరమాం దేవీం శతమధ్యాం దశావరామ్

గాయత్రీ యో జపే న్నిత్యం న స పాపేనలిప్యతే

(హారీతస్మృతి - అ. 4-48)

వేయి పర్యాయములు గాయత్రిని జపించుట శ్రేష్ఠము. నూరు పర్యాయములు జపించుట మధ్యమము. పది పర్యాయములు జపించుట అధమము. ప్రతి దినము గాయత్రిని జపించు వారు పాపకార్యములకు దూరముగా నుందురు. తద్వారా దుఃఖములు దూరమగును.

జపము మూడు విధములు. 1) వాచకము (దగ్గర వారికి వినబడునట్లు పఠించుట), 2) ఉపాంశువు (శబ్దము చేయక పెదవులను, నాలుకను ఆడించుట), 3) మానసికము (మనస్సుతో మాత్రమే చేయుట). ఇందు వాచకమున కన్న ఉపాంశువు, ఉపాంశువు కన్న మానసిక జపము ఉత్తమమైనవని ఋషులు చెప్పుదురు.

అగ్నిలో ఆహుతు లొసంగుచు కూడా గాయత్రిని జపించ వచ్చును. అందువలన మనోవాక్కాయములు శుద్ధమగుటతో బాటు వాతావరణ దోషములు పోయి ఋతుక్రమము ప్రాణి మనుగడకు అనుకూలముగ మారును. ఇందుకు ప్రమాణము-

శ్లో.హూతా దేవీ విశేషేణ సర్వకామ ప్రదాయినీ
సర్వపాప క్షయకరీ వరదా భక్తవత్సలా
(శంఖస్మృతి - 12-19)

దివ్య గుణములు గల (గాయత్రీ) మంత్రము నుచ్చరించుచు అగ్నియందాహుతులు వేసినచో (ఏయే కోరికలతో చేయుదుమో అందుకు దగిన ఓషధులు సేకరించి విధి పూర్వకముగ అగ్నిలో అహుతు లొసగినచో) అట్టి వారి శారీరక దోషములను, బాధలను పోగొట్టి గాయత్రి సకల మనోరథములను నెరవేర్చును.

"పృధివ్యాం విష్ణు ర్వ్యక్రగం స్త గాయత్రేణ చన్దసా"
(యజు. 2-25)

గాయత్రీ మంత్రములతో చేయబడిన యజ్ఞము ఈ పృథివీ మండల ప్రాణులకు సుఖముల నొనగూర్చును.

(అగ్ని హోత్ర లాభములను తెలుసుకొన గోరువారు నాచే రచింపబడిన "అగ్నిహోత్రము - వైజ్ఞానిక స్వరూపము" అను గ్రంథము చదువ గోరెదను.)

**అందరు జపించ వచ్చునా ?**

యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ
(యజు. 26-2)

పరమేశ్వరుడనైన నేను ఈ కల్యాణకరమగు వేదవాణిని మానవమాత్రులందరి కొరకు ఉపదేశించు చున్నాను. అటులనే మీరును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకే గాక వారి భృత్యులకు, వారి స్త్రీలకు మరియు సదాచారపరులైన అంత్యజులకును ఉపదేశింపుడు అని, వేదము ద్వారా పరమేశ్వరుడు స్పష్టముగ చెప్పుచున్నాడు.

అందుచే గాయత్రీ మంత్ర జపము వర్ణ, కుల మత, ప్రాంత భేదము లేక మానవమాత్రులందరు చేయవచ్చును. స్త్రీలు కూడ నిస్సంకోచ ముగా చేయవచ్చును. వాల్మీకి రామాయణములో కౌసల్య అగ్నిహోత్రము చేసినట్లుగా, సీతాదేవి సంధ్యా వందనము చేయు ఆర్య గృహిణిగా వర్ణింపబడినది-

"సా క్షౌమవసనా హృష్టా నిత్య వ్రతపరాయణా

అగ్నిం జుహోతి స్మ తదా మంత్రవిత్కృత మంగళా"

(వా. రా. 2-20-15)

శ్రీరాముడు వనవాసమున కేగుటకై తల్లి అజ్ఞ కొరకు ఆమె వద్దకు వెళ్ళినపుడు "నిత్యము వ్రతపరాయణియు, ప్రసన్న చిత్తయునగు కౌసల్యాదేవి పట్టువస్త్రము ధరించి వేదమంత్రములతో అగ్నిహోత్రము (హోమము) చేయుచుండెను."

"సంధ్యాకాలమనాః శ్యామా ధ్రువ మేష్యతి జానకీ

నదీం చేమాం శుభజలాం సంధ్యార్థే వరవర్ణినీ"

(వా. రా. సుందరా. 14-49)

ఆంజనేయుడు లంకానగరమున సీతాదేవిని వెదుకుచు సాయం సంధ్యాసమయ మగుట గమనించి, ఇది సంధ్యాసమయము గనుక సంధ్య చేయుటకై ఈ పవిత్ర నదీ తీరమునకు ఆర్య గృహిణి కనుక సీతాదేవి తప్పక రాగలదని తలంచెను.

వీరేగాక ఘోష, అదితి, గోదా, నదీ, యమీ, శశ్వతీ, సరమా, ఊర్వశీ, అత్రేయీ మొదలగు విదుషీమణు లెందరో మంత్ర ద్రష్టలైన ఋషికలుగా వేదములందు కనపడుచున్నారు. అట్లే, కక్షీవంతుడు, శబరుడు మొదలగు శూద్రులు ఋషులుగా వేదములందు కనపడుచున్నారు. కనుక నిస్సంకోచముగ స్త్రీ, శూద్రులు గాయత్రిని జపించవచ్చును.

## జపించుటకు యజ్ఞోపవీతము అవసరమా ?

యజ్ఞోపవీతము ఒక వ్రత చిహ్నము. యజ్ఞమనగ పరోపకారాది ఉత్తమ కర్మలు - (యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ). అట్టి పరోపకారాది కర్మలు చేయుటను వ్రతముగ స్వీకరించి దీక్షా కంకణముగ ఈ యజ్ఞోపవీతమును ధరింతురు. ఇందు మూడు ప్రోగు లుండును. ఇది మన భుజముపై పితృ దేవ ఋషి ఋణములను మూడు ఋణ భారములున్నట్లు తెలుపుచుండును. మనను కని పెంచి పెద్దచేసిన తల్లితండ్రుల సేవించి పితృ ఋణమును, మన శరీరము ద్వారా వెడలు మల మూత్ర నిశ్వాస స్వేదాదుల ద్వారా జరుగుచుండు వాతావరణ కాలుష్యము నివారించుటకు నిత్యాగ్నిహోత్రము చేయుచు దేవ ఋణమును, ఏ జ్ఞాన విజ్ఞానముల ద్వారా నేడు మనము యిన్ని సుఖముల ననుభవించుచున్నామో అట్టి జ్ఞానమును మనము పొంది మన అనుభవములను చేర్చి ముందు తరముల వారి కందించుచు ఋషి ఋణమును తీర్చుకొనవలయునని ఈ యజ్ఞోపవీతము గుర్తు చేయుచుండును.

ఈ విషయమును గ్రహించిన ప్రతి వారును యజ్ఞోపవీతమును ధరించవచ్చును. శూద్ర పరివారములో జన్మించినను విద్యాసదాచారముల వలన ద్విజత్వమును పొందవచ్చును (శూద్రో బ్రాహ్మణతా మేతి - మనువు). దీనిని ధరించుటకు స్త్రీ పురుష భేదము ఏమియును లేదు. స్త్రీలకు కూడా ఈ మూడు ఋణ భారములు నుండును. ప్రాచీన కాలమున స్త్రీలు యజ్ఞోపవీతము ధరించినట్లు ఎన్నో ప్రమాణములు గలవు.

నేడు మధ్య కాలమున ఏర్పడిన మూఢాచారములను ఎదిరించ సాహసించలేని వారు యజ్ఞోపవీతమును ధరింపలేకున్నను గాయత్రిని జపించవచ్చును. పరమేశ్వరుడు వేద మంత్రములను మానవమాత్రు లందరి కొరకు ఉపదేశించెను. ఈ మంత్రముతో దైవ ప్రార్థన చేసుకున్న దోష మేముండును ?

# గాయత్రీ ప్రశంస

1.“ప్రగాయత్రేణ గాయత పవమానం విచర్షణిం

ఇందు సహస చక్షసమ్”

(ఋ. 9-60-1)

విశేషముగ ఈ గాయత్రీ మంత్రముతో సత్కర్మలయందు ప్రేరే పించువాడును, మనలను కనిపెట్టి చూచువాడును, బ్రహ్మాండము నంతటిని తన ఐశ్వర్యముగ గలవాడును, పరమ సుఖదాతయునైన ఈశ్వరుని యొక్క గుణగానము జేయుచుందుము.

2.“యద్ గాయత్రే అధిగాయత్ర మాహితం............

య ఇత్ తద్ విదుస్తే అమృతత్వ మానశుః”

(ఋ. 1-164-23)

గాయత్రీ మంత్రమునందు రక్షణ శక్తి నిండియున్నది. అది మన గాయన్ - ప్రాణములను రక్షించును. దుఃఖముల పాలు గాకుండ రక్షించుచుండును. ఎవరు ఈ సత్యమును గ్రహింతురో వారు అధిక ముగ ఈ మంత్ర జపము చేసి అమృతత్వమును పొందుదురు.

3.“గాయత్రేణ ప్రతిమిమీతే అర్కమ్” (ఋ. 1-164-24)

“గాయత్రీ మంత్రము ద్వారా స్త్రీ, పురుషులు అర్కమ్ (పర మాత్మ)ను చేర గలుగుచున్నారు.”

4.“తథో హస్మాసతే సవితృప్రసూతా ఏవా

సర్వే కామాః సమృధ్యంతే” (శత. బ్రా 2-3-4-7)

ఈ గాయత్రీ మంత్రము జపించు వారలకు బుద్ధి వికసించి తద్వారా విద్యా విజ్ఞానములు వర్ధిల్లి కామధేనువు వలె యిది వారి

సర్వ కోరికలు తీర్చుచున్నది.

5. "యా వై సా గాయత్రీ ఇయం వావ సా యేయం పృథివ్యస్యాగం,
హీదగం సర్వభూతాం ప్రతిష్ఠితామేవ నాతిశీయతే"
(ఛా. ఉ. 3-12-2)

గాయత్రి నిశ్చయముగ అందరిని కాపాడునది. అది భూమి వలె అందరిని కాపాడుచుండును. గాయత్రియందే ప్రపంచమంతయు ప్రతిష్ఠితమై యున్నది. గాయత్రి నేదియు అతిక్రమించజాలదు.

ఈ 20 వ శతాబ్ద తొలిదశలో వ్యాకరణ భాస్కరుడిగ ప్రసిద్ధి చెందిన స్వామి విరజానంద సరస్వతి బాల్యముననే మశూచి వ్యాధితో అంధత్వమును పొందెను. తల్లిదండ్రులు చిన్ననాటనే స్వర్గస్థులైరి. బంధువుల ఆదరణ కూడ కోల్పోయెను. చివరకు గృహమును వీడి మూడు సంవత్సరములు పెక్కు కష్టముల ననుభవించి అడవి మార్గమున హృషీకేశమునకు చేరెను. అచట మూడేండ్లు ఉదయ సాయం సంధ్యా సమయాలలో గంగా నదిలో నిలబడి బాగుగా గాయత్రీ జపము చేసెను. తదుపరి హృషీకేశ నిర్జనారణ్యమున పెక్కు సంవత్సరములు తపస్సు గావించెను. దానితో వారికి బుద్ధి వికసించి జ్ఞానచక్షువు తెరువబడినది. ఏకసంతాగ్రాహి అయ్యెను. పిమ్మట హరిద్వారమునకు వచ్చి కేవలము వినియే వ్యాకరణాది సమస్త శాస్త్రములను నేర్చుకొనగలిగెను.

ప్రపంచ ప్రసిద్ధమైన అష్టాధ్యాయి వ్యాకరణ రచయిత మహర్షి పాణిని బాల్యమున నొక సాధారణ బాలకుడు, గురువుగారు చెప్పిన పాఠములను కొద్దిసేపటిలోనే మరచిపోవు చుండెడివాడు. అందువలన నతని గురువు పాఠములు చెప్పుట మానివేసెను. అంతట నతడు శ్రద్ధా భక్తులతో నియమముగ గాయత్రీ జపము చేయ నారంభించెను. దాని ప్రభావము వలన కొంతకాలమునకు అతని బుద్ధి వికసించి గొప్ప వ్యాకరణ పండితుడయ్యెను. వారి వ్యాకరణము నేటి ప్రపంచ మేధావులను కూడ ఆశ్చర్యచకితులను జేయుచున్నది.

ఇదంతయు గాయత్రీ జప మహిమయే

6. శతపథ బ్రాహ్మణ ప్రశంస :

"త్రయీ విద్య (అనగా జ్ఞాన, కర్మ, ఉపాసనలు) గాయత్రి నుండియే గ్రహింప బడినవి. గాయత్రి యొక్క మూడు పాదములు మూడు వేదముల యొక్క అవయవములు. త్రయీ విద్య యందు (వేద త్రయమైన ఋక్, యజు, సామము లందు) ప్రతిపాదింపబడి యున్న వైజ్ఞానిక రహస్యములు ప్రతీక (అవయవ) రూపమున గాయత్రి యందున్నవి." – (శత. 14-8-4-1)

7. బృహదారణ్యకోపనిషత్తు ప్రశంస :

"గాయత్రీమంత్ర ప్రథమపాద సాధనచే భూ అంతరిక్ష ద్యులోకములు, అందలి పదార్థములు ప్రాప్తించును. ద్వితీయపాద ఉపాసనచే జ్ఞాన, కర్మ, ఉపాసన లను వేదప్రతిపాదిత త్రయీ విద్యలు అవగతమగును. తృతీయపాద సాధనచే ప్రాణ అపాన వ్యాన వాయువులు, వాటి ఆధారముతో జీవించు ఈ ప్రాణి సమూహమంతయు అతనికి వశమగును." -(బృహ.ఉ 5-14-1,2,3)

8. మనుస్మృతి ప్రశంస :

శ్లో॥ అకారం చాప్యుకారం చ మకారం చ ప్రజాపతిః ।
వేదత్రయా న్నిరదుహద్ భూర్భువః స్వ రితి ॥

(మను. 2-76)

ప్రజాపతియైన పరమేశ్వరుడు అకార, ఉకార, మకారముల కలయికతో (అ+ఉ+మ) ఏర్పడిన 'ఓ3మ్' పదమును మఱియు మహా వ్యాహృతులైన భూః, భువః, స్వః పదములను వేదత్రయీగా చెప్పబడు ఋక్, యజుః, సామ వేదముల నుండి పిండెను. (అనగా ఆ వేద సారములను ఒక్కొక్క అక్షరముగా సంక్షిప్త పఱచి ఉపదేశించెను.)

శ్లో ॥ త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాదం మదూ దుహత్ ।
త దిత్యృచోఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః ॥

అట్లే, పరమేష్ఠీ ప్రజాపతియైన పరమేశ్వరుడు ఒక్కొక్క వేదమునుండి అనగా ఋక్ యజు స్సామముల నుండి ఒక్కొక్క పాదమును పిండి మూడు పాదములు గల సావిత్రీ (గాయత్రీ) మంత్రమును నిర్మించెను.

9. మహాభారత ప్రశంస :

శ్లో ॥ య ఏతం వేద గాయత్రీం పుణ్యాం సర్వగుణాన్వితాం ।
తత్త్వేన భరత శ్రేష్ఠ । స లోకే న ప్రణశ్యతి ॥

(మహా. భా. భీష్మ ప. 14-16)

భరత శ్రేష్ఠ ! ఓ ధర్మరాజా! సర్వ శుభగుణ యుక్తము, పుణ్యము నగు గాయత్రీ తత్త్వమును యథావిధిగ తెలుసుకొనువాడు ఈ ప్రపంచమునం దెన్నటికిని నష్టపోడు.

ఈ భారతములోనే అనుశాసన పర్వంలో ధర్మరాజు అడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా భీష్ముడు విస్తృతంగా గాయత్రీ మంత్ర వైశిష్ట్యాన్ని కొనియాడుట కాననగును-

*ధర్మరాజ ఉవాచ :*

శ్లో ॥ పితామహ మహాప్రాజ్ఞ సర్వశాస్త్ర విశారద ।
కిం జప్యం జపతో నిత్యం భవేద్ ధర్మఫలం మహత్ ॥

శ్లో ॥ ప్రస్థానే వా ప్రవేశే వా ప్రవృత్తే వాపి కర్మణి ।
దైవే వా శ్రాద్ధకాలే వా కిం జప్యం కర్మసాధనమ్ ॥

శ్లో ॥ శాన్తికం పౌష్టికం రక్షాం శత్రుఘ్నం భయ నాశనమ్ ।
జప్యం యద్ బ్రహ్మ సమితం తద్ భవాన్ వక్తు మర్హతి ॥

(అను శాస. 150 - 1, 2, 3)

ఓ పితామహ ! మహా విద్వాన్ ! సర్వ శాస్త్ర విశారద !

ఏ మంత్రం జపించడం వల్ల గొప్ప ధర్మ ఫలం లభించును?

ప్రయాణ సమయంలో, విశ్రాంతి సమయంలో పనులు చేసుకుంటూ కూడా జపించదగిన మంత్రమేది? దేవ పితృ యజ్ఞాదులు నాచరించుచు స్మరించ దగిన మంత్రమేది? దేనిని జపించడం వల్ల శాంతి, సుఖము, ఆనందము, శత్రువుల నుండి రక్షణ, భయ నాశము కలుగును? ధన ధాన్య రాజ్యాదుల పుష్టి కలుగును?

*భీష్మ ఉవాచ :*

శ్లో ॥ యానపాత్రే చ యానే చ ప్రవాసే రాజవేశ్మని ।
పరాం సిద్ధి మవాప్నోతి సావిత్రీం హ్యుత్తమా పఠన్ ॥

శ్లో ॥ న చ రాజ భయం తేషాం న పిశాచాన్న రాక్షసాత్ ।
నాగ్న్యంబు పవన వ్యాలాద్ భయం తస్యోప జాయతే ॥

శ్లో ॥ చతుర్ణామపి వర్ణానా మాశ్రమస్య విశేషతః ।
కరోతి సతతం శాన్తిం సావిత్రీ ముత్తమా పఠన్ ॥

శ్లో ॥ నాగ్నిర్దహతి కాష్ఠాని సావిత్రీ యత్ర పఠ్యతే ।
న తత్ర బాలో మ్రియతే న చ తిష్ఠన్తి పన్నగాః ॥

శ్లో ॥ న తేషాం విద్యతే దుఃఖం గచ్ఛంతి పరమాం గతిమ్ ।
యే శృణ్వంతి మహద్ బ్రహ్మ సావిత్రీ గుణ కీర్తనమ్ ॥

శ్లో ॥ గవాం మధ్యే తు పఠతో గావోஉస్య బహు వత్సలాః ।
ప్రస్థానే వా ప్రవాసే వా సర్వావస్థాం గతః పఠేత్ ॥

శ్లో ॥ జపతాం జుహ్వతాం చైవ నిత్యం చ ప్రయతాత్మనామ్ ।
ఋషీణాం పరమం జప్యం గుహ్యమే తన్నరాధిప ॥

శ్లో ॥ సోమా దిత్యా న్వ యాః సర్వే రాఘవాః కురవస్తథా ।
పఠన్తి శుచ యో నిత్యం సావిత్రీం ప్రాణినాం గతిమ్ ॥

శ్లో ॥ అభ్యాసే నిత్యం దేవానాం సప్తర్షీణాం ధ్రువస్య చ ।
మోక్షణం సర్వ కృచ్ఛ్రాణాం మోచయత్య శుభాత్ సదా ॥

ఓ ధర్మరాజా ! ఉత్తమోత్తమమైన సావిత్రీ పఠనమే (గాయత్రి జపమే) సర్వకార్యములందును, సర్వకాల సర్వావస్థలందును చేయదగినది. అట్టి జపమే చెడు పనుల నుండి దూరము చేయుచు క్రమముగా మోక్షప్రాప్తిని కలిగించును. ఈ మంత్రమును జపించిన రాజన్యులకు ఓడలు, విమానములు, రథములు మొదలగు అన్ని ప్రయాణ సాధనములు, అతిరథ మహారథులతో కూడిన విశాల సైన్యము లభించి దేశాంతర రాజ్యప్రాప్తి కలుగును.

సదా గాయిత్రిని జపించు వానికి రాజుల వల్ల గాని, పిశాచ రాక్షసుల వల్ల గాని ఎట్టి భయము ఉండదు. అగ్ని జల వాయు సర్పాదులు అతనికి హానిని కలిగింపలేవు. నాలుగు వర్ణములవారు నాలుగు ఆశ్రమములలోను పఠించ దగిన శాంతినిచ్చు ఉత్తమ మంత్ర మిది. సావిత్రీ పఠనము జరుగుచోట అగ్ని ప్రమాదములు జరుగవు. శిశు మరణము లుండవు. సర్పాదుల భయ ముండదు. అవి దూరముగా పారిపోవును. ఈ గొప్ప వేద మంత్రమైన గాయత్రీ శ్రవణము చేయువానికి

దుఃఖములన్నియు తొలగిపోయి పరమగతి యైన మోక్షము ప్రాప్తించును. దీనిని గోవుల మధ్య పఠించిన గోసంతతి వృద్ధియగును. ప్రయాణ ప్రవాసాది సర్వావస్థల యందును గాయత్రిని జపించుట మంచిది.

అనాది కాలం నుండి ఋషిమునులందరు జపించుచు వచ్చిన ఈ గాయత్రీ మంత్రము ఉత్కృష్టమైనది. వారు ఈ మంత్రముతోనే ఆహుతు లిచ్చుచు విశేష యజ్ఞాదులు చేసిరి. సూర్య వంశీయ, చంద్రవంశీయాది సమస్త రాజ పురుషులు, ధీరులు, వీరులు ప్రతి నిత్యము శుద్ధులై శ్రద్ధతో దీనిని జపించి ఉత్తమ గతిని పొందిరి. ఈ గాయత్రిని సమస్త దేవతలు, సప్త ఋషులు, ధ్రువుడు కూడా నిత్యము జపించిరి.

సదా దీనిని జపించువారి దుర్గుణము లన్నియు తొలగిపోవును. సత్కర్మములయందు ప్రేరణ కలుగును. అవిద్యాది క్లేశము లన్నియు తొలగి పోయి ఆత్మ పరమాత్మల సాక్షాత్కార మగును. వర్ణనాతీతమైన దివ్యానందము లభించును.

**10. శంకస్మృతి ప్రశంస :**

శ్లో ॥ హుతా దేవీ విశేషేణ సర్వకామ ప్రదాయినీ ।
సర్వ పాపక్షయకరీ వరదా భక్త వత్సలా ॥ (12-19)

గాయత్రీ మంత్రముతో అగ్ని యందాహుతు లిచ్చినచో సకల శారీరక మానసిక దోషములు నశించును. సకల కోరికలు నెరవేరును.

**11. ఋషి మునుల ప్రశంస :**

(అ) 'గాయత్రికి బ్రహ్మకు (వేదమునకు) భిన్నత లేదు' – వ్యాస మహర్షి.

(ఆ) 'ముక్తి బొందుటకు గాయత్రి మూలకారణము' – శృంగి ఋషి.

(ఇ) 'గాయత్రి జన్మమరణముల బంధము నుండి విడిపించును' – విశ్వామిత్ర ఋషి.

(ఈ) 'గాయత్రి పాపములను నశింప జేయును' – యాజ్ఞ వల్క్యుడు.

(ఉ) 'గాయత్రి బ్రహ్మను (పరమాత్మను) సాక్షాత్కరింప జేయును' – భరద్వాజుడు.

(ఊ) 'గాయత్రి ఉపాసన వలన దీర్ఘాయువు లభించును' – చరకుడు.

(ఋ) 'గాయత్రీ జపము వలన దుర్మార్గుడు కూడ పవిత్రుడై పోవును.' (అనగా సన్మార్గుడై పోవును) - వశిష్టుడు.

(ౠ) గాయత్రి వేదములకుమాత. ఈ ప్రపంచమునకును గాయత్రీ మాతయే. - మహాదేవుడు.

(ౡ) 'గాయత్రి సర్వశ్రేష్టమైన మహామంత్రము. దీనినే గురు మంత్రమందురు. ప్రాచీన కాలం నుండి దీనినే ఆర్యులందరు జపించుచు వచ్చిరి. - *దయానంద మహర్షి*

**12. మహాపురుషుల ప్రశంస :**

- 'గాయత్రీ జపము నాలుగు వైపుల నుండి శక్తిని తీసుకొని వచ్చును' - *రవీంద్ర నాథ ఠాగూర్*
- 'గాయత్రీ జపము జీవాత్మకు ప్రకాశమునిచ్చును' - *బాల గంగాధర తిలక్*
- 'గాయత్రీ జపము భౌతిక అభావములనుకూడ దూరము చేయును' - *మదన మోహన మాలవ్య*
- 'గాయత్రీ జపము వలన గొప్ప శక్తి లభించును' - *రామకృష్ణ పరమహంస*
- 'గాయత్రీ మంత్రము సద్బుద్ధి నిచ్చు గొప్ప మంత్రము' - *స్వామి వివేకానంద*
- 'గాయత్రీ జపము కామరుచి నుండి తప్పించి రామరుచి వైపు (పరమేశ్వరుని వైపు) మరలించును' - *స్వామి రామతీర్థ*
- 'గాయత్రీ ప్రార్థన సార్వ భౌమిక (అందరూ చేయదగిన) ప్రార్థన' - *డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ*
- 'గాయత్రీ మంత్రము నందలి శబ్దములు సమ్మోహకమైనవి. అవి పవిత్ర పరచు ఉత్తమ సాధనములు' - *మహాత్మాహంసరాజ్*
- 'వర్తమాన చికిత్సా పద్ధతి సర్వ విధముల ధర్మరహిత మయ్యెను. విధి ప్రకారము ప్రతి దినము గాయత్రీ మంత్ర జపము చేయువాడు యెన్నటికిని రోగగ్రస్థుడు కాజాలడు. పవిత్రమైన ఆత్మయే పరిశుద్ధమైన శరీరమును నిర్మింప గలుగును. ధార్మిక జీవన నియమము యథార్థముగా శరీరాత్మలను గాపాడగలదని నా నిశ్చితాభిప్రాయము. ఇంతేగాక, ఈ గాయత్రీ మంత్ర జపము రాష్ట్రీయ విపత్కాలమున శాంత చిత్తముతో చేయబడిన యెడల అది సంకటములను రూపుమాపుటకై తన పరాక్రమ ప్రభావములను చూపెట్టగలదు.' - *మహాత్మాగాంధీ.*

- 'సమస్త ప్రాపంచిక దుఃఖముల నుండి విముక్తి నొందుటకును, వాస్తవిక యోగాభ్యాసముద్వారా మోక్షప్రాప్తిని బొందుటకును మార్గము గాయత్రి యందు వివరింపబడి యున్నది. కావున కేవలము ఈ గాయత్రి మంత్రము యొక్క నిరంతర జపము ద్వారానే యోగసాధకులకు ముక్తి కలుగ గలదు.

*- యోగి అరవింద.*

- 'సూర్యుడు తన ప్రకాశముతో చీకటిని పోగొట్టి పగటిని చేసినట్లు గాయత్రీ ఉపాసకుని హృదయములో సవితాదేవుడు అవిద్యాంధకారమును పోగొట్టి ఆత్మను ప్రకాశపరచును.' - స్వామి ప్రభు ఆశ్రిత.

-"చిన్నతనంలో నేనొక మొద్దు అబ్బాయిని. ఎంత చదివినా తలకెక్కక బాగా దెబ్బలు తినేవాడిని. దెబ్బలకు తాళలేక ఆత్మహత్యకు పాల్పడటం, ఎట్లో రక్షింపబడటం కూడ జరిగాయి. స్వామీ నిత్యానందుల వారి ఉపదేశంతో ప్రతినిత్యం తెల్లవారుఝామున నిద్రలేచి అత్యంత నిష్టతో గాయత్రీ మంత్రాన్ని అర్థభావనతో జపించటం మొదలు పెట్టాను. తత్ఫలితంగా అయిదారు నెలల్లోనే బుద్ధి వికసించడం ప్రారంభమయింది. జ్ఞాపకశక్తి పెరిగింది. క్రమంగా విద్వాంసుడను కాగలగటమే గాక "ఆర్య గెజిట్" "మిలాప్" పత్రికలకు సమర్థవంతమైన సంపాదకుడను కాగలిగితిని. సంన్యాసినై వేద ధర్మ ప్రచారము చేయుచు నేడు మీ సత్కారములను బొందగలుగుచున్నాను. నా 8వ యేట నుండి యిప్పటి (81సం॥ల) వరకు గాయత్రీ మాత ఒడిలో కూర్చుని అమృతపానము చేయని దినముగాని, రాత్రిగాని లేదు. *-ఆనందస్వామి సరస్వతి*

"ఇహ పర లోకములందు గాయత్రికంటె పవిత్రమైన వస్తువేదియు లేదు. వేద వేదాంగములను జదువుట వలన గలుగు ఫలితమే గాయత్రీ మంత్ర జపము వలన గలుగు చున్నది. గాయత్రిని ముప్పూటలా జపించుటచే శుభము కలుగుచున్నది. ఈ వేదమంత్రము పాపముల నాశనమొనర్చి ఉత్తమ ఆరోగ్య, సౌందర్య, వ్రత, వీర్య, బ్రహ్మ వర్చస్సులనొసగెడిదై యున్నది."

*-స్వామి శివానంద సరస్వతి.*

"హిందువులు విగ్రహారాధకులు కారు. ఏలయన, వారి ధ్యేయ (Greed) మంత్రము గాయత్రి. ఈ మంత్రమును 'తత్' - (అ) శబ్దమే యొక పరోక్ష (invisible) సృష్టికర్త - అనగా సవిత వంకకు సంకేత మొనర్చుచున్నది. అనేకు లీ మంత్రమును సూర్యోపాసనా మంత్రముగా నుడువుచున్నారు. కాని అది సరికాదు. ఏలయన సవితాశబ్దము సృష్టికర్తయైన ఈశ్వరునే బోధించుచున్నది. ఇదియును గాక ఈ మంత్రమున జ్ఞానము - బుద్ధి నిమిత్తమే ప్రార్థన కలదు. కావున నా జ్ఞానదాత జడ సూర్యుడెన్నటికిని కాజాలడు. ఇంతేకాదు, ఇందొక గొప్ప విశేషము కలదు. ఈ మంత్రమందు గల 'నః' శబ్దము సమాజవాచకమై యున్నది. కాన స్త్రీ పురుషాది మానవ మాత్రులందరికి దీని జపింప నధికారము కలదు. ఇట్లు మన పూర్వులు విగ్రహారాధకులు కారనియు, నిరాకార ఈశ్వరునే ధ్యానించు చుండిరనియు, ఈ నిరాకార ధ్యానమునకు ముఖ్యసాధనము గాయత్రీ మంత్రమనియు, స్త్రీ పురుషులకు గాయత్రీ మంత్రము జపించు నధికారము కలదనియు స్పష్టమగుచున్నది.

- స్వామి వివేకానంద

(Lecture on Gayatri at America)

"క్రైస్తవ మతమునకు క్రీస్తుదక్క మరెద్దియును లేదు. ముస్లిము మతమునకు హజరత్ మహమ్మదు దక్క మరెద్దియును లేదు. బౌద్ధ మతమునకు బుద్ధుడు గాక మరేమియు లేదు. ఈ పురుషులే వారి వారి ధ్యేయము. అనగా నీ పురుషులుదక్క వారికి ధ్యానింపదగిన దేదియును లేదనుట. నేను క్రైస్తవుడనే అయినను సత్యము చెప్పుటలో నాకెట్టి సంశయమును లేదు. హిందువుల యొక్క ధ్యేయ మంత్రము 'గాయత్రి' ఇది లేకుండ ఋషులుగాని, మునులుగాని, మహా పురుషులుగాని జీవింప జాలరు. హిందూమతము ఏ మానవవ్యక్తి విశేషముపై నాధారపడి యుండలేదు. ఈ గాయత్రి ద్వారా తిన్నగా పరమేశ్వరు నుండియే వారు జ్ఞానమును బడయగలుగు చున్నారు.

- సర్ మోనియర్ విలియం

(The Buddhisam)

## మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

12-10-586/6, వ్యాస్ నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

| | పుస్తకము పేరు | రచయిత | వెల |
|---|---|---|---|
| 1. | గోమాత | (డా॥ కోడూరి సుబ్బారావు) | 7-00 |
| 2. | వైదిక వైజ్ఞానిక సంస్కృతి | " | 10-00 |
| 3. | మానవ ధర్మము | " | 3-50 |
| 4. | గాయత్రీ మహిమ | " | 6-00 |
| 5. | వైదిక క్రాంతి పథం | " | 15-00 |
| 6. | చతుర్దశ భువనములు | " | 3-00 |
| 7. | అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము | " | 15-00 |
| 8. | యజ్ఞోపవీత వైశిష్ట్యము | " | 2-00 |
| 9. | జననీ-జన్మభూమి | " | 5-00 |
| 10. | దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ) | " | 10-00 |
| 11. | యుగపురుషుడు శ్రీకృష్ణుడు | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 6-00 |
| 12. | పురుషోత్తముడు శ్రీరాముడు | " | 8-00 |
| 13. | వైదిక వివాహ వైశిష్ట్యము | (సంధ్యావందనం లక్ష్మీదేవి) | 8-00 |
| 14. | మాతా పుత్రికల జ్ఞాన చర్చ | (లోక మల్హరి) | 15-00 |
| 15. | బ్రహ్మచర్య విజ్ఞానము | (టి. సూర్యనారాయణ) | 15-00 |
| 16. | వైదిక అర్థనీతి | " | 2-00 |
| 17. | దయానందుని ఆదర్శ రాజ్యము | " | 1-00 |
| 18. | వైదిక సంధ్యాగ్నిహోత్ర విధి | | 1-50 |
| 19. | దైనిక అగ్నిహోత్ర విధి | | 4-00 |
| 20. | ది గ్రేట్ గాయత్రి (ఆంగ్లము) | | 2.00 |
| 21. | శాంతి ప్రార్థన | | 0.75 |

*గమనిక :* తపాలా ఖర్చులు అదనము. వి.పి.పి. పద్ధతిలో సగము పైకము ముందుగనే పంపవలెను.

# ప్రకాశకీయము

వేదకాలమునుండి ఋషి మునులు గాయత్రీ మహిమను కీర్తించు చునేయున్నారు. త్రిమతాచార్యులు, వివిధ సాంప్రదాయ ప్రవక్తలు గాయత్రిని కీర్తించుటయే గాక వారి వారి సాంప్రదాయముల కనుగుణముగా వ్యాఖ్యానించియున్నారు. ఆధునిక ధర్మప్రచారకులైన వివేకానంద, రామతీర్థ, శివానంద మొ॥లగు స్వాములు గాయత్రిని గొప్పగా కీర్తించి యుండిరి.

నేడును ఆధ్యాత్మిక క్షేత్రమున గాయత్రీ ప్రచారము విరివిగానే జరుగుచున్నది. విద్వాంసులు, సాధు సంన్యాసులు గాయత్రిని గురించి వారికి తోచిన విధముగా వ్యాఖ్యానించుచున్నారు. కొందరు గాయత్రికి ఒక స్త్రీ దేవతామూర్తి రూపమును కల్పించి విగ్రహము నిర్మించి గుళ్ళు గోపురములు కట్టు చున్నారు. అచ్చటచ్చట విశేష గాయత్రీ యజ్ఞములు కూడ జరుగుచున్నవి. నేడు యింత ప్రచారము జరుగుచున్నను గాయత్రిని సరిగా అర్థము చేసుకున్నవారు చాలా అరుదు అనియే చెప్పవచ్చును. ఏలనన వీరి వ్యాఖ్యానముల వలన గాయత్రిపై శ్రద్ధ కలుగుచున్నదే కాని మూలార్థము, నిరుక్త బ్రాహ్మణాది గ్రంథములలో ఋషి మునులు గావించిన విశ్లేషణ, యదార్థముగ గలుగు లాభములు స్పష్టమగుట లేదు.

యుగప్రవక్తయైన మహర్షి దయానందుడు ప్రాచీన ఋషిమునులు వ్రాసిన వ్యాఖ్యానములను మరల వెలుగులోనికి తీసుకొని వచ్చి గాయత్రీ మంత్రమునకు చక్కటి వ్యాఖ్యానము గావించెను. స్త్రీ, శూద్రులకు కూడ గాయత్రిని ఉపదేశించెను. వారి అడుగుజాడలలో ఆర్య విద్వాంసులెందరో గాయత్రీ వైశిష్ట్యమును తమ రచనలలో, ప్రవచనములలో విశదీకరించిరి. డా॥ కోడూరి సుబ్బారావు గారు ఆర్య, హిందీ, ఆంగ్ల భాషలలో నున్న ఆ వ్యాఖ్యానములను సంకలనము చేసి తెలుగువారి కొరకు వ్యవహారిక భాషలో ఈ సంకలన రచన గావించిరి. ఏ కొద్దిమంది గాయత్రిని సరిగా అర్థము చేసుకున్నను మా ఈ కృషి సఫలము కాగలదు.

ఈ తృతీయ ప్రచురణను అందముగా అచ్చు వేసి యిచ్చుటలో సహకరించిన ప్రింట్‌షాప్, సికింద్రాబాద్ ముద్రణాలయము వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

—ప్రకాశకులు

*Maharshi Dayanand Saraswati's*

# Words of Wisdom......

1. The Vedas are the inheritance of all mankind.

2. Truth is one and for all. So also is the light of Vedas for all.

3. As there is one God, so there is one Revelation and one religion for all.

4. Be a thinker but also be a doer. Be a soul but be also a man. Be a servant of God but also be a master of nature.

5. An Arya (Noble man) should always be ready to accept Truth and giveup untruth.

6. Make the world a living place for the worthy and the noble.

7. Vedas are the scriptures of true knowledge. It is the first duty of the Aryas (Noble Men) to read them, teach them, recite them and hear them being read.

8. One should not be content with one's own welfare alone but should look for one's own welfare in the welfare of all.

9. One should promote Vidya (realization of subject and object) and dispel Avidya (illusions).

10. Let thy dealings with all be regulated by love and justice in accordance with dictates of Dharma.

# గాయత్రీ మహిమ

(మంత్రార్థము, వ్యాఖ్య, ప్రశంస)





మానవమాత్రులందరికీ గాయత్రిని ఉపదేశించిన :

**మహర్షి దయానందుడు**

సంకలన కర్త :

**డా॥ కోదూరి సుబ్బారావు**

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము**

వ్యాస్ వైదిక సేవా సమాజము

వ్యాస్‌నగర్, సికింద్రాబాద్ - 500 861